నీకు గలిగె పదునను పోకిన లోపము కొంచెనమైనట్లు కృష్ణమాచార్యులు విన్న చేపట్టగానె కృతార్థుండనైతి నని సింహాద్రిప్పలు యేమనుచున్నాడు దేవ! కృష్ణమాచార్యులకు యిచ్చిన వైకుంఠంబు నీవు యిద్దరికివ్వి యిచ్చితి గావయని వైకుంఠంబు అభయ మిచ్చెనె దా యీ సంకీర్తన శివభక్తు లాయెనేమి, విష్ణుదాసు లాయెనేమి యెవ్వరు చదివిన యెవ్వరు భక్తితో విన్న, యెవ్వరు వ్రాసిన పాపపరిహారంబవును అటుమీదట కామంత్య ముంగున వైకుంఠం బిత్తువు నీయాన నీ చరణంబులాన మా తిరుమణి తిరుమార్గంబులాన మా గురువులాన మా శ్రీకృష్ణకుమారస్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధీ!"

* * * *

*"దేవా! కృష్ణమాచార్యులు వోరుగంటిలో పతివ్రతాగృహంబున కేగిన ఆ యింటి బ్రాహ్మణుండు దండప్రణామంబు జేసి 'స్వామీ! మీరు విజయంచేసుట నా గృహంబు పావనం బాయను నేను కృతార్థుల మైతిమి మా యింట అరగించి మమ్ముల రక్షించుమని విన్నపంబుచేసిన కృష్ణమాచార్యులు యేమనుచున్నారు 'నీవు ఏకపత్నీ వ్రతుండవు విద్యాను సంధాన సంపన్నుండవు సకల ధనసంపదలు గలుగు ధన్యుండవు బృందావనమునకు విజయంచేసిన పిమ్మట మీ యింట నారగించెదనని బ్రాహ్మణుండు తులసీమాహాత్మ్యం చెప్ప మనిన ఆ బ్రాహ్మణునకు తులసీమహాత్మ్యంబు యిట్లు చెప్పంగొనంగె వినసమయమందు తులసి దర్శనంచేసినవారికి శిశుహత్య, గోహత్య, స్త్రీహత్య, మొదలైన పాతకంబులుపోవును తులసీకంఠమాయినా కట్టి సంరక్షణ చేసినవారికి వేయిసంవత్సరంబులు సాయుజ్యపదంబులుగలుగును తులసికి కోటచేయించి కొమ్మలు దీర్చిన పుణ్యాత్ములకు అశ్వమేధ ఫలంబు గలుగును తులసికి దీపం యిచ్చినవారికి సూర్యచంద్ర లోకంబులు గలుగును తులసికి రాగి, వెండి, బంగారంబుల ప్రాకారంబులు దీర్చిన పుణ్యాత్ములకు శాశ్వతంబుగా విష్ణులోకంబు గలుగును తులసికి నీరాజనంబు సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును తులసికి కోటకు గోమయంబులు దీర్చి అలికినవారికి శత సంవత్సరంబులు స్వర్గంబు గలుగును తులసికి నమస్కారంబు చేసినవారికి నాలుగులోకంబులు గలుగును తులసికి నైవేద్యంబులు సమర్పించినవారికి కామ్యంబు గలుగును నీళ్లుపోసి పెంచినవారికి జల బిందువు లెన్ని కలుగునో అన్ని సంవత్సరములు పుణ్యలోకంబులనుండి విష్ణుసాయుజ్యంబు పొందుదురు నిత్యకృత్య నమస్కారంబుచేసి పూజలు చేసినవారికి వైకుంఠంబు గల్గును. తులసికి మంత్రపుష్పమున్ను యజ్ఞోపవీతమున్ను సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును తులసికి వస్త్రములున్ను, మణులున్ను సమర్పించినవారికి స్వర్గలోకంబుగల్గును తులసియొద్ద ముగ్గు లుంచినవారికి అగ్నిష్టోమఫలంబు గల్గును తులసికి మొదట అరుగుచేసినవారికి అష్టైశ్వర్యంబులు గలుగును తులసి మొదట మృత్తిక ధరియించినవారికి లలాటలోచనుని దర్శనంబు గలుగును తులసిపూజలు అష్టాక్షరి ద్వాదశాక్షరీజపంబు చేసిన పుణ్యాత్ములకు అష్టపుత్రులు గలుగును ద్వాదశి దినంబున వైకుంఠంబు గాంతురు తులసీదళంబుల శేషశాయి పూజచేసినవారికి శంకరలోకంబు గలుగును తులసిదళాన తీర్థపానం చేసినవారికి సకల తీర్థంబులయందు గాంగాది నదులయందు స్నానంబు చేసిన ఫలంబు గలుగును దేవా! తులసీదళంబు శిరస్సున ధరించినవారు త్రిలోకాలకు అధిపతులై జన్మింతురు. ద్వాదశి దినంబున తులసీవ్రతంబు చేసిన వారు ద్వారకానగరంబున అధిపతులై జన్మింతురు తులసీబృందావనంబు అలికి ముగ్గుపెట్టి స్నానం సంధ్య జపములు దీర్చుకుని మంత్రపుష్పాంజలులు, ధూపదీప నైవేద్యంబులు సమర్పించినవారికి యింట నిత్యోత్సవ పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవ సంవత్సరాదులయందును సకలమైన భోగభాగ్యాదులు సంపదలు గలిగి శుభశోభనంబులు గలిగి యుందురు. తులసి బృందావనానకు నారికేళ కదళి ఖర్జూరఫలంబులు సమర్పించినవారికి కైలాస సన్నిధానంబు గలుగును తులసి బృందావనానకు దంపతి సమేతంగాను మూడు ప్రదక్షిణంబులు చేసి సాష్టాంగ దండప్రణామంబు లాచరించినవారికి అనేక కాలాల

---

* తాళపత్ర మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున R 447 అనుసంఖ్యతో నున్న ప్రతిలోనిది—

యందున్ను సకలమైన సంపదలు గలిగి జన్మ జన్మాల యందు పుత్రపౌత్రులంబులయందు జన్మింతురు తులసి బృందావనమునకు భక్తిపూర్వకంబుగా యథాశక్తి తాంబూల నైవేద్యంబులు జేసినవారికి భూలోకంబు శిష్యపాలనంబు చేసి విష్ణు సన్నిధానంబు నొందుదురు సాయంకాల సమయంబులయందు తులసికి దీపంబిచ్చిన స్త్రీలకు కోరిన కోరిక గలుగును తులసి బృందావనంబునకు అలికి ముగ్గు దీర్చి ఆ సాయం కాలమందు ఆరతి యిచ్చిన స్త్రీలకు శాశ్వతంబుగా అయిదవతనంబు గలుగును సంతానప్రాప్తి గలిగి సంతోషంబున నుందురు దేవా! అంత్యమందు తులసీదళోదకం యిస్తే దేహం పవిత్రంబై సద్గతి గలుగును దేవా! తులసీ మహాత్మ్యం పఠియించిన వారికి కొన్ని జన్మాదులు గడచిపోగాను శాశ్వతంబుగా కైలాససన్నిధానంబు గలుగును తులసీవనమందు వున్న దళం దెచ్చి శిరస్సున ధరించినవారికి త్వరితంబుగా ఆదిత్యపురంబు గలుగును ప్రొద్దున లేచి తులసి దర్శనంబు జేసిన వారికి పాపంబులు తొలగును ఈ కథ కృష్ణమాచార్యులు సంకీర్తన గాయగా వకయింట నలువురు కోడళ్లు నీళ్ల కడవలు తీసుకువస్తూ వుండిన వేళ ఆయింటి పెద్ద కోడలు యీ సంకీర్తన విందా మనెను రెండో కోడలు పూర్ణకడవలు దించుకొని విందామనెను కడమ యిద్దరుకోడళ్లు యీ సంకీర్తన కేమి. యీమాటలకేమి పోదాము రమ్మనిరి. కనుక యీ సంకీర్తన విందా మన్న కోడలు భూమండల మేలే రాజా కొడుకై జన్మించెను పూర్ణకుంభములు దించి విందా మన్న కోడలు చక్రవర్తియై జన్మించెను కడమ యిద్దరు యిక్కడ సంకీర్తన లేక పోదాము రమ్మన్న కోడళ్లు అనామికులయింట నూరు జన్మంబులు పందులై జన్మించిరి కనుక యీదివ్య నామస్మరణ యెవరు వ్రాసినా, యెవరు చదివినా, యెవరు పఠించినా, యెవరు విన్నా గోసహస్రదానంబులు చేసిన ఫలంబు గలుగును పితృపితామహులు విష్ణుసాయుజ్యంబు గాంతురు సకల దోషములున్ను సర్వత్రా తా జేసినపాపములున్ను నివారణమై ఆపదలు తొలగును ఆయురారోగ్య ఐశ్వర్యంబులు గలుగును పుత్రపౌత్రాభివృద్ధి గలుగును"

* * * *

"ఏమారి రజకునియింట మృత్తోను
వసియించె రిత్త కానసంబునను
నా బ్రహ్మరుద్రుల కైన గన్పడనట్టి
నృహరి నాడించెను నిత్య పెద్ద
డాకని శాపమున సర్వజని సుతియైన
చేపహాసులు కాశె శేకరిగ"

అగాంటి కృష్ణమాచార్యులు రచించిన యీ 'తెలుగువేదం' త్వరలో ప్రకటింపబడితే అది తెలుగు వాఙ్మయాని కొక విశిష్టాలంకారం అవుతుంది!



# సంగంవారి వీధి



శ్రీ ఇవటూరి కామేశ్వరరావు

ఆ ఊళ్లో చంగల్రావ్ హోటలుకు వచ్చే జనం ముచ్చటించని సంగతంటూ లేదు. దైనందిన వ్యవహారాలదగ్గరనుంచి, కాంగ్రెసు ఎలక్షనులు, బ్లాకు మార్కెట్టు, సమ్మెలు—అబ్బో ఒకటేమిటి సమస్త సంగతుల గురించి ప్రస్తావించడం పరిపాటి. ఊళ్లో ఏదైనా చావు సంభవిస్తే ఆ ప్రస్తావం అక్కడే.

పెళ్లిళ్లు, పేరంటాలు జరిగితే వాటి వార్తలు అక్కడికు వెంటనే చేరుకుంటాయికదా. కోర్టులో ఏదైనా మంచి కేసు విచారణకు వస్తే దాని ఫలితాలను గురించి యిక్కడ చర్చ జరిగితీరుతుందిగదా. బళ్ళో చేస్తారుగాను ఎవరికైనా నంచో పెట్టారంటే ఆ విషయం అక్కడ చర్చించుకోవలసిందే గదా. ఆ రోజు సంతలో మిరపకాయ ధర హెచ్చిందంటే దానిని గురించి అక్కడ ప్రస్తావన జరగవలసిందే. ఇలాగ్గా చిత్రవిచిత్రంగా సాగిపోతుంటాయి సంభాషణలు. చెంగల్రావు కూడా ఏకత్ సంభాషణల మధ్య తనకు తోచినట్లు ఒక్కొక్క విసురు విసురుతూండం పరిపాటి.

చంగల్రావుకొట్టుకు అనుదినమూ హాజరు వేసుకునే వాళ్లలో — ఆ ప్రక్క ఫ్యాక్టరీ ఫోర్మెను ఒకడూ, అగ్రహారంలో వుండే శాస్త్రులవారొకరూ, గవర్నమెంటు గ్రాంటుయిచ్చిన ఎయిడెడ్ స్కూలు అయ్యవారు, అయ్యవారమ్మగారూ ఒకయిన్సూరెన్సు ఏజంటు ఒకాయన వీళ్లు హాజరు కావలసిందే. అలా వర్షం కురవనీయండి—ఈలా ఎండలు ముదిరి ఘాడ్పులు వేయనీయండి—ఏదో ఒక సమయంలో హాజరు వేసుకొని పిచ్చాపాటి మాట్లాడుకొని పోతుంటారు.

తరుచు సుబ్బన్నకూడా ఆ దుకాణంకు రావడం కద్దు. మోతుబరి సుబ్బన్నంటే ఆ ఊళ్లో చాల మందికి తెలుసు. ఘరానా మనిషి. నిత్యమూ ఇతని కూడా ఇద్దరో ముగ్గురో తోకల్లా తిరుగుతూనే వుంటారు. తన మాటకు అడ్డంవస్తే సహించే ఘటం కాదు. వాడితోపాటే వాడి అనుచరులు కూడా ఒక మాట అతనితో ఘర్షణ పడితే ఏం విపత్తు సంభవిస్తుందోనని సౌమ్యంగా పోతుంటాడు చెంగల్రావు ఎందుకంటే వెనుక ఒకటి రెండుసార్లు అక్కడ కొట్లాటలు కూడా జరిగి తలలు పగలగొట్టుకునేంత పని జరిగింది. అందులో మోతుబరి సుబ్బన్నతో చేయి చేసుకుంటే ఆ రోజు నెత్తురు చూశారన్నమాటే.

యథావిధిగా ఫ్యాక్టరీ ఫోర్మెను పోతూపోతూ తన మామూలుగా కూర్చునే బల్లమీద కూర్చుని యింత కారప్పూస తింటున్నాడు. పెట్టించుకొని గ్రాంటుస్కూలు బడిపంతులు, అయ్యవారమ్మ బడి తలుపు బిగించుకొని రవంత యేమైనా తినిపోదామని చంగల్రావు కొట్టానికి దక్కొచ్చి ఫ్యాక్టరీ ఫోర్మెను ఎదురుగుండా వున్న బల్లమీద కూర్చుని చారెడు ప్లేటు బూంది తినసాగారు.

ఫ్యాక్టరీ ఫోర్మెను యుద్ధంనుంచి తిరిగివచ్చిన వ్యక్తి. లావుగా పొట్టిగా వుంటాడు. పిల్లికళ్లు. జుట్టు ఎప్పుడూ ముందరకు నుదిటిమీదకు వస్తుంటే పదేపదే వెనక్కు తీసుకుంటూంటాడు. ఇన్సూరెన్సుకంపెనీ యేజంటు బక్కపలచగా పొడుగ్గా వుంటాడు. ఇతగాడు 24 ఘంటలూ సైకిలుమీదే తిరుగుతూంటాడు. ఓ పది నిముషాలు తీరిక చిక్కిందంటే చెంగల్రావు కొట్టులో కూర్చుని తీరవలసిందే. ఇహ పోతే అయ్యవారూ, అయ్యవారమ్మగారిది వింత అదృష్టం. వీళ్లది అసలు దానవాయిపేటలో మకాం. మాలవాడంతా వీళ్ళంటే విపరీతమైన గురి. ఇద్దరూ కూడా ట్రైనింగ్ అయినవారేనా చెరో 50 రూపాయలు సంపాదించుకుంటున్నారు. యిప్పుడంటే వుద్యోగాలు సంపాదించారుగాని, వెనుక వీళ్ళ తాత ముత్తాతలు పురపాలక సంఘంలో వీధులు ఊడ్చి తమ పొట్టలను పోసుకునేవారు. కాని నేటి గాంధీయుగంలో 'మాల' అనే పదంపోయి దాని స్థానే హరిజన అనే పేరు రావడంతోటే పరిస్థితులన్నీ తారుమారై పోయాయి.

ఇంతకీ విషయ మేమిటంటే ప్రక్కన రెండు ఫర్లాంగుల దూరంలో ఉన్న దూపాటివారి వీధిలో బ్రాహ్మణ దొడ్డమ్మగారు ఆ క్రితం రోజు పోయారట 60 ఏండ్లుంటాయట

ఫోర్మన్ పాపం చాలా ధర్మాత్మురాలట అనేక ధర్మాలు కూడా చేసిందట

ఏజంటు ఆమె ఎవరినో పెంచుకుందట, అతను తాలూకాఫీసులో పనిచేస్తున్నాడట ఆ లోగిలీ 4 ఎకరాల భూమి అతగాడికి వ్రాసి యిచ్చేసిందిట

అయ్యవారమ్మ ఏం జబ్బుటండీ పాపం హఠాత్తుగా పోయిందట?

ఫో గుండెజబ్బుట అందులో ఈ గుండె జబ్బు చాలా విపరీతమైనటువంటిది మాట్లాడుతూనే ప్రాణం పోవడం, పడుకుని తెల్లవారేసరికల్లా హంస లేచిపోవడం, స్నానం చేస్తానే హరీ అంటూండడం ఈలాగా కర్ణకఠోరంగా వుంటూంటాయి, ఈ గుండె జబ్బు కేసులు.

అయ్యవారు ఏ వీధిలోనండీ ఆమె నివసిస్తున్నది?

ఇ ఏ ఏ వీధేమిటి — (యిక్కడే దగ్గరలోనే) దూపాటివారి వీధి—అంటే.

ఫో అంటే ఆ పెద్ద రావిచెట్టు ఉన్నది అదా—

ఏ అది కాదనుకొన్నా అది సంగంవారి వీధి ఎక్కడో చర్చిదగ్గర ఉన్నదాన్ని తీసుకువచ్చి యిక్కడ యిరికిస్తారేమిటి?

ఫోర్మను సంగంవారి వీధిలోనూ రావిచెట్టు లేదనుకున్నారా?

ఏ ఉంది లేనన్నది పెద్ద రావిచెట్టు. సంగం వారి వీధిలో ఉన్నది దీనికంటె చిన్నది.

అయ్య యింతకీ సంగంవారి వీధి ఎక్కడుంది మీకు తెలుసా?

అయ్యవారమ్మ సంగంవారి వీధే తెలియదట. నే బళ్లో చదువుకునే రోజుల్లో మా అమ్మ నిత్యమూ ఈ వీధిలో కమ్మవారింటికి ఏదో పనిమీద వస్తూండేది

అ, అచ్చు ఆఫీసు వుండే దాని ప్రక్క వీధే 'ఇంతకీ' ఫార్మర్ ఫోర్మను కళ్లు చిట్లించుకొంటూ గొంతుక సవరించుకొంటూ 'సంగంవారి వీధినే అష్ట వంకర్ల వీధి అంటారు అసలు కోణంగిపేటలోంచి వచ్చేవీధి సంగంవారి వీధిలో కలుస్తుంది'

అయ్య అచ్చే ఎక్కడ కోణంగిపేట ఎక్కడ సంగంవారి వీధి? సంగంవారి వీధి మన పాత సినిమా ఉంది దాని వెనకాల వీధి దాని ఉత్తరం వైపుని చర్చికూడా ఉంది అంతేకాని ఈ ఫోర్మను గారికి అసలు—

ఫోర్మను అందుకుని—వారు తెలుసండీ అబ్బ సంగంవారి వీధి ఎక్కడుందో నాకు తెలిసినట్లు మరెవ్వరికీ తెలియదు

ఇ ఏ అచ్చే బ్రాహ్మణపేటకు వివరాలగా రైలుగేటుకు యివతల ఉందండీ ఏమిటో వారు తెలీయనట్లు మీరు వాదిస్తారు

అయ్యవారమ్మ (చేతులు కడుక్కుంటూ) అబ్బ ఏమిటే గొడవ ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు

ఇంతలో వెంగళ్రావు లోపల నుంచి వచ్చి — సంగంవారి వీధిని గురించేనా మీరు అనుకొనేది నా చిన్నతనంలో మా ముసలమ్మవాళ్ళు ఆవీధిలోనే కాపురం ఉండేవాళ్లట. మా తండ్రికి ఋణం ఉండడంచేత ఆ యిల్లూ వాకిలీ వాళ్ల పరమైపోయింది లేకపోతే నాకే అద్దె కొంపె మొచ్చే అది అచ్చాఫీసుకు తూర్పువైపున ఉంది'

అగ్రహారంలోని ముసలాయన ఎప్పుడు వచ్చాడో వచ్చి, తాను మామూలుగా కూర్చునే చోటునుంచి ఈ సంభాషణ వింటున్నాడు అయినా సంగంవారివీధి ఎక్కడుంటే తనకేం గావాలి, ముందు తన పాట్ల వినాలి గాని — యీ విధంగా సంగంవారివీధి ఉత్తరంవైపున ఉందని ఒకరూ, చర్చికి దక్షిణభాగంలో ఉందని మరొకరూ, అచ్చు ఆఫీసు వెనకాల ఉందని వేరొకరూ యిలాగా వాండ్లు అనేక విధాలుగా తర్కించుకొంటూ ఇంకా విస్తారగాని వచ్చేలోపున సుబ్బన్న మరో యిద్దరు వ్యక్తులు లోపలికి వచ్చి వీరందరికి కుడివైపున కూర్చొని యున్ని పేడికోడీలు ఆర్డరిచ్చారు.

ఇన్స్పెక్టర్లు ఏజంటు సుబ్బన్నను చూచి 'యిదుగో పాతకాపు సుబ్బన్న వచ్చాడు యింతకీ

తెలియం దేమండి గనుక యీజాలాయ్ సుబ్బన్నా సంగంవారివీధి ఎక్కడుందో చెప్పు.'

సు: సంగంవారి వీధే తెలియదూ వీచ్చోడా! నాకు బాగా తెలుసు ఎందుకంటే మా అత్తగారు పెనుక అబ్బుచేసి ఆ వీధిలోనే పోయింది కాలువకు దక్షిణంగా ఉంది ఆ వీధిలోనుంచే రైలుగేటు కూడా కనిపిస్తుంటుంది

యింతవరకూ ఆ ప్రసంగంలో జోక్యం కల్పించుకోని ముసలాయన లేచి

అక్కే మీరంతా చెప్పేవది అసలే తప్పు వైష్ణవుల దేవాలయానికి ఆనుకుని ఉన్న వీధే సంగంవారి వీధి

సుబ్బన్న మహా చెప్పావులేవయ్యా, పాడు గాటి ముక్కు మవ్వాను నే నెక్కడుంచో చెప్పావుగా మళ్లీ నువ్వు అది కాదంటావేటయ్యా అయినా ముసిలోడవ్ నీ కెందుకు ఈ గొడవ నీవు నీ పాడుం కాగేముక్కో నీ వేమిటో అంతే కాని—

ఫోర్మను అయితే నే చెప్పింది తప్పంటారా బలే వాళ్లు! అసలు సంగంవారి వీధికే అష్టవంకర్లవీధి అని పేరు కోణంగిపేటలోంచి అచ్చు ఆఫీసువద్ద కలిసేదే అంటే మీకు నమ్మకం

మా సు నీవు చెప్పిందల్లా నమ్మాలి అని ఉందా ఏమిటి? సంగవారివీధినిగురించి నీకం తెలుసు నిన్న గాక మొన్నటివరకూ యుద్ధంలో ఏడుస్తూ—

ఫో ఫలానాచోటున ఉందని తెలవడానికి నాకు స్వాతంత్ర్యముంది మధ్య నువ్వేమిటి? ఏడుపూ గీడుపూ రానీయకు మాటలు సరిగా రానియ్యి ఏమనుకున్నావో

సు ప్రతీదీ నీకు తెలుసునని వాదిస్తావేమిటి? మహా తెలిసినట్టు ఏంచేస్తా వేమిటి? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకుని మరీ మాట్లాడు అట్టే మాట్టాడితే

ఏ. అట్లా మాట్లాడితే ఏం చేస్తావేమిటి? ఫోర్మను ఒక్కడే అనుకుంటున్నావేమో మీద చెయ్యిపడితే ఊరుకునేది లేదు. జాగ్రత్త అన్నాడు

అసలు దెబ్బలాట అనికోను గాని యింతలోకి

అయ్యగారమ్మ: ప్రతీదీ వీళ్ళకు తెలుసు ననుకుంటారు. ఈ సుబ్బన్న మరీని అబ్బ! యింతటి మొండివాణ్ని ఎక్కడా చూడలేదు

సుబ్బన్న వళ్లు తెలిక్క ఫోర్మనూ సుబ్బన్నా కొట్టుకోవడం ప్రారంభించారు గ్లాసులు విసిరేసుకున్నారు ప్రక్కనే ముసిలాయన కర్రపెట్టుకుంటే అది ఊడలాక్కుని వీపుమీద వేశాడు సుబ్బన్న. ఫోర్మను కుర్చీ పైకెత్తి విసిరాడు, దెబ్బ తప్పించుకుని, ఇటునైపుకు వచ్చి ఒక తాపు తన్నాడు సుబ్బన్న. ఆ దెబ్బతో ఫోర్మను వెనక్కువెళ్ళి గుమ్మం నడుటికి తగిలి రక్తం ప్రవహించసాగింది సుబ్బన్నతో ఉన్న తరిమ్మార్గ యిద్దరూ అయ్యగారినీ, అయ్యగారమ్మనీ కర్రతో వాలుగుతికి ఒక్కొక్కటి తోశారు. అయ్యగారమ్మకు దెబ్బతగిలి పడిపోయింది ఆ పసడంలో గ్లాసుమీద పడిందేమో బద్దలయిన గ్లాసు అంచు తగిలి మోచెయ్యి గీసుకుపోయింది

తన లాంగుచాటులోకి ఆసుకురాలేక చంగల్రావ్ వీధిలోకి పోయి వారినీ వీరినీ కేకలు పెట్టడం ప్రారంభించాడు ఈ కొట్లాట కృటికాలంలో జరిగిపోయింది ఆ గలాభా ఈ కేకలు విని బీటు తిరుగుతున్న పోలీసు కనిస్టేబిలొకడు అక్కడకు వచ్చాడు. కాని ఈలోగా సుబ్బన్నా—వాడి అనుచరులు అక్కడినుంచి దాటుకున్నారు దెబ్బలుతిన్న వాండ్లకు నెత్తురు కారుతుంటే ఖంగారెత్తి చూసిలేక మ్యునిసిపలు ఆసుపత్రికి తీసుకొనిపోయి వాండ్లకు కట్టు కట్టించడం నిమిత్తం చంగల్రావు ప్రక్కనే ఉన్న బండిని పిలవడానికి వెళ్లాడు యింతలో యీ కొట్లాటవిషయం పాక్కి జనం గుమిగూడి చివరికి సబ్ ఇనస్పెక్టరూ సిబ్బందీ తయారైనారు జరిగిన సంగతంతా చంగల్రావు వద్దనుంచి సంజాయిషీ తీసుకున్నారు అక్కడ వున్న అందరిస్టేటుమెంట్లు పుచ్చుకొన్నారు వాండ్లను ఆస్పత్రికి తగిన చికిత్సకై పంపించారు.

మూడు రోజులపాటు ఈ వీధేమిటి—ఆ వీధేమిటి ఊరూవాడా గాలించేశారు సుబ్బన్నకోసం ఈ సందట్లో ఆ రాత్రి మరి ఎలా అంటుకుందో ప్రక్కనే ఉన్న హార్మోనికొట్టు అంటుకుని కొన్ని వందల రూపాయల నష్టమైపోయింది. కొట్టులో హార్మోనీలు, ఒకటి రెండు మంచి వీణలు, యితర సామా

సులు అన్నీ భస్మమైపోయాయట వాకబు చేయగా తెలిసిందేమిటంటే అది ఫోర్మను స్వంత అన్నగారి కొట్టు అనీ, ఫోర్మనుపై కోపంచేత మున్పన్న ఆ రాత్రే అంటించమనుకొ్క డబ్బు తీసుకొని ఆ కొట్టుకు నిప్పంటించి తగలబెట్టాడని చెబుతారు

## 2

దొమ్మీ కేసు కోర్టుకు ఎక్కి మేజస్ట్రీటు సదాశివరావుగారి ఎదుట విచారణకు వచ్చింది దొమ్మీ కేసును గురించీ, అందుకు సంబంధించిన వ్యక్తుల వాఙ్మూలాలను గురించి యితర పరిశీలనలను గురించి కొంతసేపు చర్చ జరిగింది పిమ్మట దొమ్మీ జరిగిన రోజున సాక్షిమాటలలో మొట్టమొదట ఈ దొమ్మీ ఏ విధంగా ఆరంభించినదీ దాని విచారణ జరుగుతోంది

లా చదివిన ధర్మారావు అదివరకే కోర్టులో మంచి పేరు సంపాదించుకున్నాడు క్రాస్ ఎగ్జామిన్ చేయడంలో అతడి కతడే సాటి అతని విచారణలో చాలా కేసులు చిక్కువిడి తీర్పుకు వచ్చాయి

ధర్మా సంఘటన జరిగిన సాయంత్రం నీవు అయ్యవారూ, ఆ ఫ్యాక్టరీ ఫోర్మనూ పాటలు యజమాని చంద్రగలావు—ఇంకా ఎవరో ముసలాయన టిఫిన పుచ్చుకుంటూ అక్కడ వున్నారట నిజమేనా?

అయ్యవారమ్మ నిజమేనండి

ధర్మా మీరు ఆ రోజున దేనినిగురించి మాట్లాడుకుంటున్నారో మేజస్ట్రీటుగారితో చెప్తారా?

అయ్య రోగాలనుగురించి మాట్లాడుకుంటున్నామండి

ధర్మా సంభాషణలో ఎవరికైనా భేదాభిప్రాయాలు వచ్చాయా?

అ అమ్మ సంగంవారివీధి ఎక్కడవున్నదీ అనే విషయాన్ని గురించి మేము తర్కించుకోవటంలో

మేజ సదాశివరావుగారు తల ఊటంకించి, కళ్ళజోడు బల్లమీదనుంచి తీసి అద్దాలు తుడిచి గొంతు సవరించి,

'దేనిని గురించీ' అన్నారు న్యాయమూర్తి

సాక్షి అది సంగంవారి వీధి ఎక్కడ వున్నదనే విషయాన్ని గురించి తర్కించుకుంటున్నాము

మేజ సంగంవారి వీధా?

'చిత్తం సార్'

'అయితే ఏదీ ఆ సన్నటిసందు ఉన్నదే—అదేనా—ఆ సినిమా థియేటరు ప్రక్కగుండా వచ్చే సందేనా?

ధర్మారావుకు ఒక విధమైన నవ్వు వచ్చింది మేజస్ట్రీటుగారు చెప్పిన అంశం కొద్దిగా సత్యదూరంగా వున్నది

ధ 'చిత్తం తమరు సెలవిచ్చిన వీధిని గురించే సాక్షి చెబుతున్నది తమరు అనుమతిస్తే ఆ వీధి పరిసరాలను గురించి తెలుపడానికి అవకాశం ఇస్తారని మనవి

మే 'ఏమిటా పరిసరాలు' అన్నారు మేజస్ట్రీటు

ధ 'చిత్తం మీరు చెప్పేదానికంటె ఆ వీధి మరో ఫర్లాంగు ఎగువన వున్నది రైల్వేగేటుకు దగ్గరగా ఉంది ఇంత బాగా జ్ఞాపకం ఉండడానికి కారణం నా చిన్నప్పుడు మా బాబయ్యగారు తరుచు రైల్వేగేటువద్దకు నన్ను తీసుకు వస్తూండేవారు

మేజస్ట్రీటుగారు ధర్మారావు మాటలను ఖండిస్తూ,

నేను నీ యీడులో ప్రతిరోజూ ఆ వీధిలో నడుస్తూండేవాణ్ణి నే చెప్పిన విషయాన్ని ఖండించడం నీకు అనవసరమనుకుంటాను' అన్నారు కొంచెం కఠినంగా

లాయరు తల వంచుకొని నమ్రత చూపాడు

న్యాయాధికారితో తగవులాట పెట్టుకోవడం ఎందుకు అయినా అప్రస్తుతమైనట్టి విషయంమీద ఎందుకు విపరీతమైన తర్కం

ఇంతలో కోర్టులో మరో ముసలి లాయరుగారొకాయన లేచి

'మీ అనుమతితో రెండు మాటలు సార్, నేను కూడా చాలాభాగం ఆ వీధంబటే పోతూండేవాణ్ణి— ఈ వీధిని గురించి నేను చాలా పరిశోధనచేయగా— నాకు తేలిందేమంటే ఈ సంగంవారి వీధి అప్పు ఆఫీసుకు కుడివైపున ప్రారంభమై సినిమా టెంటుకట్టు చివర అంతమౌతుంది.

'అట్నే సరికాదు' అన్నాడు ధర్మారావు

మేజస్ట్రేటు సదాశివరావుగారు అసలు ఈ విషయానికి కేసుకు ప్రస్తుతం ఏమీ సందర్భం లేదనీ, దాన్ని గురించి యిక తర్కించ నవసరం లేదనీ అన్నారు ఈ దొమ్మీకేసు విచారణ ఫలితం ఏమైందనే విషయం మనకు అప్రస్తుతం కోర్టుకూ, ఇద్దూ రెన్నువిజంటూ, అయ్యవారూ, అయ్యవారమ్మా తమ తమ గాయాలు చూపడంవల్ల సుబ్బన్నమీద కఠిన చర్య తీసుకొని తీరాలని పట్టుపట్టనూ లేదు అయినా సుబ్బన్న విషయం వారి కెందుకు

దుష్టులను చేతికి పట్టుకుని దండించడం పోలీసు వారి విధి కేసు విచారించి న్యాయాన్యాయాలు తేల్చడం కోర్టువారి విధి ఈ లావాదేవీలలో తమ కెందుకు అని యథారీతిగా వారు పక్కకు తగ్గుకున్నారు.

మేజస్ట్రేటుగారి బావమరిది చంద్రశేఖరంగారు ఆ క్రితంరోజే పెళ్లివ్యవహారాలు మాట్లాడుకు వెందుకు చెల్లెలుగారింటికి వచ్చాడు చంద్రశేఖరం కొడుకు రామచంద్రమూర్తి ఈ మధ్యనే బి ఏ ప్యాసై అయాడు ఇతను చూడడానికైతే బాగానే వుంటాడు కాని మనిషి కొంచెం నలుపు పొడుగ్గా, సదసదలాడే వయస్సులో ఉన్నాడు చంద్రశేఖరం తన కొడుక్కి చెల్లెలు కూతురు శారదను వివాహం చేయాలని కుతూహలపడుతున్నాడు

కాని, అసలు ఈ పెండ్లివిషయం ఇదివరకు ఒకటి రెండుసార్లు మేజస్ట్రేటుగారి ప్రత్యక్షంలో నయితే నేమి, పరోక్షంలోనయితే నేమి వలిగిన విషయమే కాని చంద్రశేఖరానికి గ్రామంలో పని తొందరవల్ల ఈవిషయం ఆలోచించేందుకు రవ్వంత కూడా వ్యవధి లేకపోయింది పైగా ఇప్పుడు తన కొడుకు చదువు కూడా పూర్తిఅయింది గనుక, పెళ్లి గూడా అయితే ఆ బరువు తీరిపోతుందని—వివాహం స్థిరపర్చుకుని—తాంబూలాలు పుచ్చుకుని తరువాత జరుగవలసిన తతంగంకోసం ప్రయత్నం చేసుకోవాలని కుతూహల పడుతున్నాడు

ఇంతకీ రామచంద్రమూర్తి పనుకే కొంచెం నలుపైనా తీసిపారేసే అంత సులువుకాదు చిన్నప్పటినుంచీ గొప్పవాళ్ల రచనలన్నా వారి ఉపన్యాసాలన్నా, వారి గ్రంథాలన్నా అతగాడికి ఆసక్తి మెండు విశ్వవిద్యాలయంలో పట్టం పుచ్చుకున్న తరువాత ఇటీవల నవ్యసాహిత్యకారుల రచనలను చదివి బాగా అవగాహన చేసుకున్నాడేమో ఇక తానుకూడా ఒక రచయితఅయి ఒకకవియై, ఒక పత్రికాధిపతియై దేశసేవ చేయాలని గాలిలో మేడలు కట్టుకుంటున్నాడు

ఆ పిల్లమీద తన మనసు కూడా పోయిందేమో ఆమెనే పెండ్లి చేసుకోవాలని అతగాడికి మనసులో నాటుకుపోయింది తనకు కాదని మరెవరకు కట్టపెడతారు ఆ పిల్లని ?

సుమారు 8 ఘం కావచ్చింది సాధారణంగా కొంచె మించుమించు ఈ సమయానికే భోజనాలు అయే అలవాటు పెళ్లిలో ఇచ్చిపుచ్చుకోవలసిన లాంఛనాల విషయంలో బావమరదులకు తెగక ఆ రోజు భోజనాలు కూడా ఆలస్యమయినాయి పెళ్లి సంగతే వరండాలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు

మే భార్య భోజనాలకు వేళయింది లేవండి యిహ తరువాత కూర్చుందాం

చంద్రశేఖరం బావగారూ—మీరు ఊఁ అనడమే తరువాయి ముంగు తాంబూలాలు పుచ్చుకుంటే, మిగతా సవంతా మేము మాచుకుంటాం

మే భా లేవండీ చేసినవన్నీ చప్పగా చల్లారిపోతాయి భోజనాలయిన తరువాత

చంద్ర ఇదుగో లేస్తాం బావగారు లేస్తే నేనూ లేస్తాను

మేజ ఇందులో నాదేముందోయ్ అంతా మీ చెల్లెల్ను అడుగు ఆమె యిష్టానుసారమే కాని, నా ప్రమేయం ఏమీ లేదు

చంద్ర అదేమ్మాట నా ప్రమేయం లేదంటా రేమిటి ? యిది మరీ బాగుంది ! మీ రనేది మీరు పెద్దలు 'ఆ మాట' మీరు లాంఛనప్రాయంగానైనా అనకపోతే ఎట్లా ?

మేజ అనడాని కేముంది ఇంతకీ మా శారద ఏమంటుంది ఏమి మాట్లాడలేము ? ఆ పుస్తకాలు అక్కడ పారేద్దూ బాబు కాస్సేపు మీ బావకు

శార అబ్బ పోదురూ ఒకటే గొడవ చదువుకోనిక్వరుగదా యీ కథ చాలా ఇంట రెస్టింగ్ గా ఉండే సమయంలో

మే భా. అమ్మాయీ, ఏమిటా విస్సాటం మీ నాన్నగారు ఏదో అంటుంటే బదులు చెప్పక ?

శార నన్నడగ నక్కర్లేదు అంటూ అక్కడ నుంచి లేచిపోతుంది

మే భా ఏమీ పలకరు ఉలకరు ఉద్దేశ మేమిటో చెప్పకూడదూ ?

మేజ నా పుద్దేశాని కేముంగే ? మీ అమ్మాయి నడుగు అమ్మాయి నడగక నన్నడుగుతా వేమిటి ?

మే భా అమ్మాయినీ అడిగారు, అబ్బాయినీ అడిగారు యిహ మీరే తరవాయి

మేజ ఏమో వచ్చేఏడు చేయాలని వున్నది పెళ్లంటే మాటలేవిటి ? ఈ రోజుల్లో అబ్బో అబ్బో బోలెడుఖర్చులు కాస్తా కూస్తా నేమిటి ?

మే భా యింకా ఖర్చులేమిటండీ ? ఖర్చు లంటారు ఉభయఖర్చులు మీ బావగారే పెట్టుకుం టారట అమ్మాయికి 10 కాసుల బంగారం గొలు సులు, వజ్రాల కంఠమాల, లేడీస్ రిస్టువాచ్, పట్టు చీరలు, వెండికంచం, మరచెంబు—యిహ కావలసిం దేముంది గనక తాంబూలాలు పుచ్చుకుంటే సరి

మేజ ఈమధ్యనే—మాదు మన లాయరు ధర్మారావు పెళ్లివిషయంలో అతని బావమరది కన పడి యీ ప్రస్తావనే తెచ్చాడు

బావ అంటే మీ కోర్టులో ప్రాక్టీసు

మేజ అవును అయనే

బావ చూడండి ఆ పెద్ద రావిచెట్టు వుంది—ఆ దూపాటివారి వీధిలో వున్న ఆయనేనా ?

మే భా భోజనాలకు లేవకూడదుటండీ యిహ ఆలస్యం అవుతోంది

మేజ అబ్బే అది దూపాటివారి వీధి కాదు ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువచ్చి దూపాటి వారి వీధి అంటావేమిటోయ్ బలేవాడివ్

బావ కాదండీ, దూపాటివారి వీధిలో రావి చెట్టు లేదంటారేమిటి ? ఆ వీధి మొదట్లోనే ఉండి తీరాలి.

మేజ ఉండొచ్చు దూపాటివారి వీధిలో ఉన్నది పెద్దది సంగంవారి వీధిలో ఉన్నది చిన్న చెట్టు ఇంతకీ నే చెప్పిన వీధి సంగంవారి వీధి

బావ ఏమో మరి ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు ?

మే ఇప్పుడు పాతసినిమా థియేటర్ వున్నదే దాని ప్రక్కగుండా వెళ్లే సందు రైల్వేగేటుకు దగ్గ రగా ఉన్నది

బావ : అదికాదండీ చూశారూ, అచ్చాఫీసు వుంది—దాని ప్రక్క వీధే సంగంవారి వీధి ఈ మాత్రం నాకు తెలియదూ ?

మే భా రామాయణంలో పిడకలవేట. సంగం వారి వీధి ఎక్కడుంటే ఏం ? మంగలివారి వీధి ఎక్కడుంటే రేం ?

మేజ ఆఁ నేను పాతసినిమాథియేటరు ప్రక్కగుండా వెళ్లే సందే సంగంవారి వీధి అంటున్నా మీ అన్నగారు అది కాదంటున్నారు

మే భా మా అన్నయ్య చెప్పిందే రైటు అచ్చాఫీసు ప్రక్కవీధే అది మా ముత్తవతల్లి చెపు తుంటే విన్నాను

మేజ అదిసరేం తెలుసు అయినా తెలిసీ తెలియని వాదన లెందుకు నీకు ?

మే భా బాగుందండి మీ రవేది ఇక మీ కొక్కరికే గాబోలు ఊరుసంగతి తెలిసినది

మేజ నా చిన్నతనమంతా, చదువుసైతం యీ వూళ్లో పూర్తిఅయింది ఏమిటో నాకు తెలియ నట్లు, మీకు మహా తెలిసినట్లు మాట్లాడతా వేమిటి ?

మే భా అయన మాటలకేం గాని—

మేజ నీవు మహా చెప్పొచ్చావులెద్దూ లోప లికి పో అయినా ఊళ్ళోకి వెలకోసారి, ఏడాది కోసారి వస్తూ—వూరు సంగతి ఏం తెలుసు మీకు. ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువెళ్ళి దూపాటి వారి వీధి అంటే ఎవరైనా నమ్మాలా అక్కర్లేదా ?

బావ మా తండ్రిగారి హయాంలో ఏదో వుస్త కాలు అచ్చువేసే సందర్భంలో అచ్చాఫీసుకు పంపే వారు. అచ్చుఆఫీసుకు ప్రక్కనుంచే సంగంవారి వీధి తెలుస్తుంటేది. నాకు బాగా గుర్తు లేదంటారేమి టండీ.

శారద · ఏమిటండీ—యీ గొప్ప నవ్న పుస్తకం పూర్తిచెయ్యవియ్యరా ఏమిటి ?

మేజ అమ్మాయ్—నీవు చెప్పు సంగంవారి వీధి ఎక్కడుందో!

శారద ఓస్ దీన్ని గురించా సంగంవారి వీధి పాతసినిమా థియేటరు ఉందే దాని ప్రక్కగుండా వెళ్ళే సందే సంగంవారి వీధి

మేజ బాగా కరెక్టుగా చెప్పావ్ అది కాదంటాడు వీరి మావయ్య

శారద ఆ వూళ్ళో ధాన్యమేమిటో, పంట ఏమిటో అంతేకాని, మావయ్యకు ఏమీ తెలియదండీ నాన్నా మా కాన్వెంటు స్కూలుకు వెళుతుంటే ప్రతి రోజూ మా బండి ఆ వీధి ప్రక్కనుంచే వెళుతుంది సుబ్బన్న గారి అమ్మాయి ఆ వీధిలోనుంచే వస్తుంటేది

మే. భా నీకు మహా తెలుసు పసిపిల్లవు నీ వూరుకుందూ

శారద బాగుందే అమ్మా ఏం వాడు మాత్రం తెలియదూ

మేజ దాన్ని ఊరుకోమంటూ వేమిటే ఏం దానికిమాత్రం తెలియద్దా?

బావ బావగారూ, మీరు బాగా ఆలోచించండి సంగంవారి వీధినే అసలు అప్పవంకర్ల వీధి అంటారు. కోణంగిపేటలోంచి అచ్చుతాఫీసువద్ద కలిసే వీధే సంగంవారి వీధి

మేజ ఆలోచించే దేమిటండీ ఆలోచనా పాలోచనాను మీరన్నది తప్పండీ సినిమా థియేటరు ప్రక్కగుండా వెళ్ళే సందే సంగంవారి వీధి ఇంత విపరీతి చెప్పినా మీరు కాదంటే ఏమి చేయాలి

బావ యింకా మీతోటి వాదించి ఏం ప్రయోజనం

మేజ అయితే నే చెప్పింది కాదంటారా?

బావ నే చెప్పిందిమాత్రం తప్పు ఎక్కడుంది.

మే భా మన కెందుకు వచ్చిన గొడవ ఇది. సంగంవారి వీధి ఎక్కడుంటే ఎవరి క్కావాలి ముందు అమ్మాయి పెళ్ళిసంగతి ఆలోచించండి

మే. అయితే తీతానే తేమిటి?

మే. భా తాంబూలాలు పుచ్చుకోమని

మేజ పుచ్చుకోవచ్చులే యిప్పుడు వచ్చిన తొందర ఏమీ లేదు

మే భా మీ యిష్టం బాబూ ప్రాణం విసిగి పోతూంది మీతోటి ఇప్పుడు గాకపోతే మరి కెప్పుడో అయినా అమ్మాయిని యివ్వకపోతే వాడికి పెళ్ళి జరగదా వాడు దీన్ని పెళ్ళి చేసుకోకపోతే దీనికి పెళ్ళవదా?

బావ అమ్మాయి నీ వూరుకో అయితే బావగారు తాంబూలాలు పుచ్చుకోవడం దాకా వచ్చి మళ్లీ ఇట్లా మాట్లాడుతున్నారా

మేజ దాని పెళ్ళి కిప్పుడేం తొందర లేదండీ తరువాత మాదుకోవచ్చు

మే భా పెళ్ళి లేదు—ఏమీ లేదు కూర్చో పెట్టండి యింకా ఎన్ని రోజులు పెళ్ళి చేయకుండా కూర్చొపెట్టా లనుకున్నా

బావ నే వస్తానే అమ్మాయి ఇప్పుడు బండి వుంది రాత్రి రైలుకి పోతున్నా

మే భా అదేమిట్రా భోజనంఅయినా కాలేదు భోంచేసి వెళ్లు నా మాట విను

చంద్ర భోజనావికేం లేవే భోంచేస్తే రైలు దాటిపోతుంది నే వెళ్తొస్తా అంటూ వచ్చినదారినే వెళ్ళిపోయాడు చంద్రశేఖరం

## 4

మరికొన్ని రోజులకు తరువు మేజిస్ట్రేటుగారింటికి వచ్చే సూరిశాస్త్రిగారు ఆ రోజు మధ్యాహ్నం ఏదో పనుండి వచ్చారు. వరండాలో కూర్చొని తాంబూలం వేసుకోపాగారు పోకలు నములుతూ శాస్త్రిలవారు

'నా మనస్సుకు ఈ విషయం పట్టినట్టు మరేదీ పట్టలేదు నాకు అర్థమయినట్లు మరెవరికీగూడా అర్థమవనే అయిఉండదు' ధర్మారావును ఉద్దేశిస్తూ గాలోలు—'అయినా ఆ వృత్తిలో సతతమూ తిరిగ వాళ్ళకూ, ఆ ధారాశుద్ధి, ఆ వాక్శుద్ధి వుండదూమరి చెడ్డఅలవాటు ఏమంటే కావలసిన పాత్ర్యమూ, పరిశోధనా రుజావూ లేకుండా వితండవాదం చేసినందువల్ల ప్రయోజనం ఏముంటుంది దీనివల్ల దీన్నిగురించి చివరకు కొన్ని ప్రాణాలు పోయాయి '

శాస్త్రిలవారు మరో రెండు తములపాకులు తీసుకుని నములుతూ—

'యింతకీ సంగంవారి వీధినిగురించి జ్ఞాపకం ఉన్నదా ?'

'మేజ లేకేం'

'మూరి అదెక్కడ వుంటంటారు ?'

మేజస్ట్రీటుగారు పెన్సిలు తీసుకుని టేబిలు అట్టమీద వివరంగా గీచి చూపుతూ, 'అక్కడనుంచి మొదలు ఇంకీవరకూ ఉన్నదే సంగంవారి వీధి '

శాస్త్రిలవారు బాగా పరీక్షించి తదేక దీక్షతో ఆ మ్యాపును చూచి గొంతు సవరించుకుని,

'మీరు శ్రమపడి మ్యాపు గీయడమైతే గీశారు గాని—అసలు ఈ వీధ ఎక్కడుందన్న విషయంలో మీ అభిప్రాయం కూడా తప్పే—ఆ రోజు లాయరు గర్వాక్షరావు చెప్పింది తూచా గా సరిపోయింది' అన్నారు కొద్దిగా నవ్వుతూ

'ఓహో అల్లాగ'—అంటూ అంతవరకూ ఖులాసాగా సంతోషంతో కబుర్లుచెప్పిన మెజస్ట్రీటు సదాశివరావుగారు ఛీదరించుకుంటూ ధ్రువమని కుర్చీలోంచి గభాలున అక్కడనుంచి లేచ్చిక్కా పోయారు

'ఇదేమిరా బాబు – ఎన్నడూ లేనిది నేను ఈయనకు కోపం తెప్పించానేమో' అనుకుంటూ మెల్లిగా ఇంటికి బారాడు శాస్త్రిలవారు

కోపం శాంతించిం తరువాత మేజస్ట్రీటుగారు వాకబుచేయగా తేలినవిషయ మేమంటే ఈ సంగం వారి వీధిలో సంగం బాపన్న అనే అతడు ఉండే వాడనీ, పిమ్మట అతను చనిపోగా అతని కొడుకు సంగం చలమయ్య క్రైస్తవమతం పుచ్చుకుని తనకు అక్కడ ఉన్న స్థలం, ఆపాటికొట్లు అన్నీ పురపాలక సంఘంవారికి అమ్మేసి ఎగో వూరు లేచిపోయాడనీ, యిప్పుడు ఆ స్థలంలో పురపాలక సంఘంవారు ఎలిమెంటరీ పాఠశాలయు యి వలనే నిర్మించారనీ, కాగా యిప్పటి పురపాలకసంఘ ప్లానులో అసలు సంగంవారి వీధి లేనేలేదనీ తేలింది



# రాయలవారి ఋతువర్ణనలు

శ్రీ దివాకర్ల వేంకటావధాని

ప్రబంధములు వర్ణన ప్రధానములైన కావ్యములు. పెద్దనార్యుని నాటినుండియు ప్రబంధకవు లేదో యొక యితివృత్తము కల్పించుకొని తమ కావ్యములలో నష్టాదశవర్ణనములను గావించుచునే యున్నారు. ఈ పదునెనిమిది వర్ణనలయభావము ప్రబంధమున నొక లోపముగా భావింపబడుటచే కొందఱు కవులు ప్రసక్తి లేకపోయినను నియమానుసరణమునకై యనావశ్యకములైన వర్ణనలు కావించుటయు గలదు. వర్ణ్యవిషయములైన యీ యష్టాదశవిషయములలో ఋతువులు కూడ జేరి యున్నవి. అందుచే ప్రబంధకవులు కథాసందర్భమునుబట్టియో కొన్ని ఋతువులనైన వర్ణింపకుండరు. శ్రీ కృష్ణదేవరాయలవారు తమ యాముక్తమాల్యదలో నాలుగు ఋతువులను సాలంకారముగా సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో వర్ణించియున్నారు. ఆ వర్ణనలలో వారి యనన్యకవిసాధారణమైన ప్రతిభాచాతుర్యములను ప్రదర్శించియుండుట యాముక్తమాల్యద పఠించిన వారెల్లరకును విదితమే. ఆ ప్రతిభాచాతుర్యముల నీ వ్యాసమున యథాశక్తిగా నిరూపింప యత్నించెదను.

గోదా శ్రీరంగేశ్వరుల ప్రణయమే యాముక్తమాల్యదయందలి ప్రధానవృత్తము. అది యందలి చివరి రెండాశ్వాసములలో జక్కగా వర్ణింపబడి యున్నది. మొదటి నాలుగాశ్వాసములలో నీ కథతో నంతగా సంబంధము లేకపోయినను వైష్ణవమతాభిమానులగుటచే రాయలవారు విష్ణుపారమ్యమును సూచించు విష్ణుచిత్తయామునాచార్యుల వృత్తాంతములను వివరీకరించి యున్నారు. విష్ణుచిత్తుడితర మతస్థుల నోడించి పాండ్యరాజునకు వైష్ణవమతసారము నుపన్యసించు సందర్భమున ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమును, యామునాచార్యుడు శ్రీరామమిశ్రునిచే నుద్బోధితుడై కుమారునికి రాజ్య మొప్పగించు సందర్భమున దీర్ఘమైన రాజనీతి వర్ణనమును గలవు. చివరి యాశ్వాసమున మాలదాసరి వృత్తాంతము ముపకథగా నున్నది. ఈ యుపకథోపాఖ్యాన రాజనీతి వర్ణనలకు దోడు ముఖ్యముగ గ్రీష్మవర్ష శరద్వసంతముల విపులవర్ణనములున్నవి. ఇవన్నియు గలిసి యాముక్తమాల్యదయందలి ప్రధానకథను మఱుగుపుచ్చి దాని నొక చిన్న విష్ణుపురాణముగా నొనర్చినవని వస్త్వైక్యమునకు భంగము చేకూర్చు నప్రసక్త విషయ విస్తరణ మాముక్తమాల్యద పఠించు వారి కించుక కించ కలిగించినను అందలి ప్రకృతి పరిశీలన భావగాంభీర్యాదుల హృద్యమైన యానందమును జేకూర్పక మానవు.

ఆంధ్రవాఙ్మయమున కొల్లింటికవులు తమ తమ కావ్యములలో వసంతాది ఋతువులను వర్ణించి యుండకపోలేదు. కాని యావర్ణనలెవ్వియు రాయలవారివర్ణనములంత దీర్ఘములుగా గాని సాలంకారములుగా గాని కానరావు. ఆంధ్రవాఙ్మయముననే కాదు సంస్కృతవాఙ్మయమునగూడ ఋతువర్ణనైకవస్తుకములగు ఋతుసంహారాదుల నొక్క నితరకావ్యములలో నింత దీర్ఘమును సరసమైన ఋతువర్ణనము కానబడదు. ఇటీవల గవిసమ్రాడ్బిరుదాంచితులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు ఋతువులను పేర నొక ఋతువర్ణన ప్రధానమైన కావ్యమును ప్రకటించియుండిరి. అందలి వర్ణనములు సైతము భావగంభీరములై కవిగారి ప్రకృతి పరిశీలన నైశిత్యము ననేక విధముల వెల్లడించుచున్నవి. చిన్నదయ్యు మనోహరమైన యీ కావ్యము నేకవిధముగా రాయలవారి ఋతువర్ణనలకు సాటిగా పోటిగా చేర్కొనవచ్చును. మిగిలినవానిలో ఋతువుల వర్ణనములున్నను ఇన్ని ఋతువుల వర్ణనము లేదు, ఉన్న ఋతువుల వర్ణనమైనను ఇంత సమగ్రమైనది కాదు.

స్థూలముగా బరిశీలించినచో నాముక్తమాల్యదలో ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యాన రాజనీతి వర్ణనాదులవలెనే యతిదీర్ఘములైన యీ ఋతువర్ణనములును గథాగమనము నడ్డగించి కావ్యమునందలి వస్త్వైక్యమునకు భంగము కలిగించియుండుట యథా

ర్థమే యనిపించును కాని నూత్నముగా వారి చెప్పను వానికి గథాంశములతో గని కల్పించిన సంబంధము స్పష్టముకాకపోదు ద్వితీయాశ్వాసము నందలి కథకు వేశ్యాగృహమున కరుగుపాండ్యరాజు పరదేశివిప్రుడు పఠించిన సుభాషితశ్లోకము వాలించి, మహాత్ముగా విరక్తుడై సౌధమునకు మరలివచ్చి మోహ ప్రదుడైన దేవు డెవ్వడో నిర్ణయింపుడని పండితుల గోరిన ఘట్టము కేంద్రభూతమైనది సుభాషితము చదివిన విప్రుడెప్పటి కప్పుడు వచ్చుటకు "దన్ని కట వృషగిరి హరికి నిత్యము విప్పగా" జరుగు తెప్పతిరునాళ్లకామ కోరికయే కారణము అళఘరియందుండు సుందరబాహుస్వామికి దెప్ప తిరునాళ్లు వేసవిలో జరుగును ఆ యుత్సవ ముల గన్నులార భక్తితన్మయుడై చూచి పోవుచు బరదేశి బ్రాహ్మణుడు మధురానగర దిదృక్షు ప్రవేశప చ్చుటికరిగి, రాజపురోహితునింట గ్రీష్మ కాలోచితమైన మృష్టభోజనము కావించి, తోడి విప్రులతో మార్గవేదికపై బరుండి యుబుసుపోకకై వారిలో నొక్క డార్యలును వేఱొక్కడు గీతలను బఠింప దాను సుభాషితము జదివెను అతడు మార్గ వేదిపై బరుండుటకు హేతువు "పెన వేసవి" అతి డచ్చుటికి వచ్చుటకు హేతువా వేసవిలో వృషగిరి హరికి జరుగు తెప్పతిరునాళ్లు వేసవిలో దప్ప మఱొ కప్పుడా యుత్సవము జరుగను జరుగదు, పరదేశి బ్రాహ్మణు డప్పటికి రాను రాడు వచ్చినను మార్గ వేదిపై బరుండడు మార్గవేదిపై గాక యే గృహాంత ర్భాగముననో శయనించి యాతడు సుభాషితముల జదివినను వీథిలో బోవువారి కవి వినబడవు పాండ్యు డా సుభాషితమును వినకుండినచో గథాసంవిధాన మీ తీరున సాగియేయుండదు ఇన్నిటికిని హేతువగుట చేతనే రాయ లిచ్చట నా వేసవిని వర్ణింపబూని నాడు

చతుర్థాశ్వాసమున వర్షశరదృతువులు వర్ణింప బడినవి ఈ వర్ణనలు యామునాచార్యుడు తనతో వాదము చేయవచ్చినవారి నెల్లర నోడించి విష్ణు దేవుడే పరతత్త్వమనియు విశిష్టాద్వైతమే మత మనియు బ్రతిష్ఠించిన పిమ్మట జేయబడినవి పాండ్య రాజు యామునాచార్యుని మాహాత్మ్యమునకు సంతో షించి, సాష్టాంగ మెఱగి, యాతనికి దన కడగొట్టు చెలియలి నిచ్చి పెండ్లిచేసి, "యరణంబుగ సమ్మహో త్సవకు ధారాపూర్వకముగా నర్ధరాజ్య మిచ్చి" యువరాజుగా నొనరించెను పిమ్మట నాతని కధర్వ శిరస్సభ్యస్త మగుటయు నందు దివ్యాస్త్రమంత్రంబు లుండుటయు నెఱింగి దుస్సాధంబగు విరోధి యానంబు సాధింపుమని దండయాత్రకు బంప యామునాచార్యు డందుకు సన్నద్ధు డగుచుండెను అప్పటికి సరిగా గ్రీష్మము ముగిసి వర్షాగమ మారం భము కానుండెను పురోహిత ప్రధానమంత్రి వర్గంబు యామునాచార్యు దిగ్విజయ యాత్రా సన్నాహ మెఱింగి "సన్నిహితంబులగు నీ వార్షిక దినంబులు గడపి శరత్సమయంబున విద్విషత్సంహా రంబునకు విజయము సేయు"మని బోధించిరి యువ రాజు వారి మాటలు పాటించి, ఋతుతెఱంగు రాజున కెఱింగించి తత్సమ్మతి నప్పటికి నిలిచెను

ఋతువు లాఱింటిలో శరదృతువు వీరరస ప్రధానమగు దిగ్విజయయాత్ర కనువైనట్టిది సాధార ణముగా బూర్వపురాజులు దండయాత్ర వెడలుట యా ఋతువునందే ఈ యాచారమును బురస్కరించుకొనియే సంస్కృతాంధ్రకవులు పలువురు దిగ్విజయయాత్రలను వర్ణించుటకుముందు శరత్తును వర్ణించి యుండిరి కాళిదాసు రఘువంశమున రఘుమహారాజు దిగ్వి జయ యాత్రకుముందు శరదృతువును వర్ణించి యుండుట యెల్ల రెఱింగినట్టిదే సంస్కృత నాటకముల ప్రస్తావనలలో వీరరసము ప్రధానరస మైనప్పుడు శరదృతువు వర్ణింపబడవలెనని లాక్షణి కుల నియమము కావించుట యారసమునకును ఋతు వునకును గల యానుకూల్యమును బురస్క రించుకొనియే యైయుండును ఈ సంప్రదాయము ననుసరించియే రాయ లిచ్చట యామునాచార్యుని దిగ్విజయమునకు నాందిగా శరదృతువును వర్ణింప దలచినాడు

ఈ శరదృతువర్ణనమునకుముందు మిక్కిలి దీర్ఘ మైన వర్షర్తువర్ణనము కలదు దీని కిచ్చట నంతగా ప్రసక్తి లేదు కాని పాండ్యరాజు తన చెల్లెలిని యామునాచార్యున కొసంగి, యాతని యువరాజుగా నొనరించి, దిగ్విజయయాత్రకు బ్రోత్సహించినది గ్రీష్మర్త్వంతమునందు వార్షికదినంబు లప్పటి కతి సన్నిహితములై యుండెను. వర్షర్తువు గడచిన

పిమ్మటగాని యామునుడు చైత్రయాత్రకు బయలు దేఱరాదని వృద్ధపురోహితాదుల యభిప్రాయము ఈ వర్షకాలము రాకపోకలను సూచించు తలంపుతో రాయలు శరదృతువుకు పూర్వము దానిని వర్ణించి యుండెను ఆయన ఇతర ఋతువులయందు గంటె వర్షర్తువందభిమాన మెక్కువ ఆ నాన యీ యభిమానము వర్షర్తువర్ణనమునం దలైన స్పష్టముగా గోచరించును ఈ వర్షర్తువురాక నాయన యంతకుముందే "గ్రీష్మసమయ విరహోత్సాహకేకిరమణి, ఘనఘనధ్వని కలరు చందమున వలరి" పాండ్యరాజు భార్య యాతనిలో యామునా చార్యమదంతము వెల్లడించెను సందర్భమున నతి రమణీయముగా సూచించియున్నాడు ఈ సూచ నయూ దగువాత సాగిన వర్ణనయు మిక్కిలి మనోహర ములుగా నున్నను ఇంత దీర్ఘముగా నా ఋతువు నిచ్చట వర్ణించుట కొంత యప్రసక్తముగా నేయున్న దని చెప్పవలయును

పంచమాశ్వాసమునందలి కథ కలంకారమైనది గోదా విరహాఘట్టము ఈ విరహ మాంధ్రవాఙ్మయ మున కపూర్వమైనది పోర్దమైన యనురాగము నింతి తెస్సగా సూచించు విరహమును వర్ణించిన కవి యాంధ్రవాఙ్మయమున నింకొక్కడు లేడు విరహమున కుద్దీపనమైనది వసంతము అందుచేతనే రాయ లిచ్చట నీ వసంతర్తువును సమగ్రముగా వర్ణింప బూనినాడు

మొదల నాముక్తమాల్యద మదనతాప
తరణి సెమవెట్ట వేగిన దక్షిణాశ
మత్కృపలోపమ్మకు దుదముట్ట మాసునదియు
దొలగ నన నుత్తరాశకు దొలగ దరణి

గోదాదేవి ధనుర్మాసమున విష్ణుసేవావ్రతమును బూని ముప్పదిదినములు ముప్పదిపాటలుగా దివ్యప్పై పాడెనని ప్రతీతి దీని కనుగుణముగా రాయలు నై పద్యమున మార్గాసు దక్షిణాశ వీడి యప్పు డుత్తరాశకు దొలగెనని వర్ణించియున్నాడు

ఈ విధముగా నీ ఋతుచతుష్టయవర్ణనమును మిక్కిలి దీర్ఘమైనను గథ కేదో విధముగా నించుక సంబంధించియే యున్నదని తెలియవచ్చుచున్న ఈ ఋతువర్ణనముబట్టియే కాక రాయలు కావించిన రాజనీత్యాదులవర్ణనములను బట్టి కూడ జూచినచో కాక చతిపర్షకాభిలాషి యని పాడగట్టును ఏదైన విష యములను వర్ణింపదలచినప్పుడు దానిని సర్వాంగసుంద రముగను సమగ్రముగను వర్ణించినగాని యాతనికి దృప్తికలుగదు అచలాకాలముతీరే యట్టిది కాబోలును. కార్యనిర్వహణముననగాని భోగాను భవముననగాని సమగ్రతయే యప్పటివారి లక్ష్యముగా నుండెను కార్యమును సామిసామిగా జేసి యూరకుం డుటకాని, భోగవిలాసముల నించించుక యను భవించి విరమించుటకాని వా రెఱుగని పద్ధతులు ఆ చిత్తవృత్తియే యీవర్ణనలందును గోచరించు చున్నది ఈ నాలుగువర్ణనములును సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో గూడి సర్వసమగ్రములుగా నున్నవి. ఈ సామగ్ర్యమే వాని కవితకు కావ్యసాధారణమైన గాంభీర్యమును దెచ్చిపెట్టినది

కాలమెప్పుడు నొక్కమాదిరిగా నుండదు అది ప్రతిక్షణమును బరివర్తన మొందుచుండును ఆ పరివర్తనప్రకారము దినములు గడచినప్పుడు కాక ఋతువులు మాఱినప్పుడు మిక్కిలి స్పష్టముగా గానిపించును ఒక్కొక్క ఋతువున కొక్కొక్క వాతావరణ ముండును పంచభూతాత్మకమైన ప్రకృతిలో గలుగు మార్పు యీ వాతావరణమునందలి మార్పునకును గారణమైయుండును ఈ మార్పు మానవులందరికిని గోచరించినను గవులదృష్టికి మఱింత స్పష్టముగా విశదముగా గోచరించును దానిని వారు నిపుణముగా బరిశీలించి యక్షరరూపమైన యాకారముతో వచ్చుకొట్టుదురు అట్టి ఋతువులకు సంబంధించిన భిన్నభిన్న వాతావరణముల సుందరముగా జిత్రించి వానిని బఠితలముందు సాక్షాత్కరింప జేయుటలో రాయలు కడుంగడు నేర్పరి ఆముక్తమాల్యదలో నాతడు గ్రీష్మవర్షశరద్వసంతములకు సంబంధించిన వాతావరణ పరిస్థితులను ప్రకృతి సౌందర్యవిశేషమును జిత్రమునందట్లు మిక్కిలి స్పష్టముగా వర్ణించినాడు ఆతడు వర్ణించిన మరుమరీచికలు, కాల్కలిభలను రెండకు బసలగా గాలిలో నెగిరియాడు తూలికకములు, బొందుమల్లియలు, ప్రపలు, సుడిగాలులు గ్రీష్మమునూర్తిని మన కట్టెదుట సాక్షాత్కరింపజేయుచున్నవి వర్షకాలము రాగానే యీ పరిస్థితులన్నియు మాఱిపోయినవి. అప్పు డాకసమున నెచ్చట జూచినను బంచలా

సహితములైన ఘనాఘనములు, ఇంద్రగోపములు, శక్రకార్ముకపు బలు వన్నెకట్ల కెత్తిదైన నవచేసు కాళ్ళగుంపనగా” వడచు వానకాళ్లు కానబడును తొలివానజల్లుతో గరకానికాయములు పడపాకును భూమిపై తెల్లరౌడల ఛత్రాకపంక్తి ఉప్పతిల్లును చెఱువులలో కేకాక చిన్నచిన్న పడియలలో గూడ వృత్తభేదానుకృతితో భేకధ్వను లెవలారును కోకిలల పంచమ స్వరములకు బదులు కేకుల షడ్జస్వరములు వినిపించును మనకు సప్తశాలాలోకకముల కుకలయూ(మాలిక మాలుగా కదంబకుటజ నీపకకుభయూథికలను క్రొత్తపాయకములతో దన తూణీరమును నింపుకొనును “ఆమని కేళి బచ్చ చాంపేయకముల నమ్మి కడపళ్ళ దమ్ముర్నైచిన్నాడుము. వానపడువారిని జూచి నవ్వినట్లు కేతకి గహనతతులు వికసించును ఈ పరిస్థితులన్నియు వర్షాదేవత వింతమూర్తిని మన కనులయెదుట నిల్పునటులలో నాశ్చర్య మేమి? శరత్తు రాగానే మరల నీ దృశ్యమంతియు నదృశ్యమగును. అప్పుడు తెల్లని మేఘములు, కాశస్తంభములు, శాలిమంజరులు, గజముల తిర్యగ్దంత ప్రహారములు, మరకత మాలికల యొయ్యారపు నడకలు కనులకు బందువు చేకూర్చును హేమంత శిశిరర్తువులలో మరల నీ దృశ్యములు, వస్తువులు మృగ్యములైపోవును వసంతము రాకతో మలయమారుతప్రసారములు, చిగురాకుల సోయగములు, క్రొన్ననల పరిమళములు, అళిఝంకారములు కోయిలల పంచమస్వరములు ప్రకృతికొక వింత రామణీయకము నాపాదించును సహకార వృక్షములు పుష్పించి పుష్పబాణున కక్షయ తూణీరత్వము కలిగించును ఇట్లే ఋతువుల యాకృతిలో గల వైలక్షణ్యమును సుస్పష్టరేఖలతో దీర్చిదిద్దుటకు నిశితమైన ప్రకృతిపరిశీలనము కావలయును అది రాయలవారి యందు సర్వతోముఖముగా గోచరించును అందుచేతనే యాయన ఋతువర్ణనముల బఠించునపుడు భావగతమైన యానందము కలుగుటయే కాక ఆ కాలసంజనితములైన యాయా ఋతువు లనుభవమునకు వచ్చుట కూడ బొంగట్టును

ఆయా కాలములందలి ప్రకృతిపరిస్థితులు మాత్రమే అతి సూక్ష్మ వివరములతో ప్రత్యక్షమగుట రాయల వర్ణనములందలి యొక ప్రత్యేకలక్షణము. సాధారణముగా మనము చూడని, చూచినను అంతగా బరిగణించని విషయముల నెన్నింటినో యాయన చక్కగా వర్ణించి యచ్చటి వర్ణన కెంతో సహజత్వము చేకూర్చును చరాచరప్రపంచమంతయు నాయన దృష్టియెదుట సుస్పష్టరేఖలతో వచ్చి నిలుచును వస్తువుల సూక్ష్మాధిక్యములతో నాయనకు బనిలేదు బోటకులను బొమ్మిడాయ డాకొట్టకులంబుల భక్షించుటయు భూపాలురంతఃపురముల భోగముల ననుభవించుటయు నాయన సమానాదరముతోనే వర్ణించును వేసవిలో జట్రాల ప్రాచిపెన్నిట లెగయుటయు, దమరసద్రవ్యంబు పంకజ శాంకభానుప్రతతులు హరింప బ్రహ్మదేవునితో మొఱవెట్టుకొనుటకై పోవుచున్న కూర్మయుతపవితానమూ యను భ్రాంతి గొల్పు సుడిగాలులు విసరుటయు, ప్రావృషమున వానకు జడిసి వృక్షముల క్రింది కేఁగు జనుల జల్లు తలపడక మున్నే తిరులు వంగుళ్ళ దడుపుటయు, శరత్తున నర్కమండలి కభ్ర మస్తమైనంతనే లేకు లెఱుమాని హిమము విస్తృతి చూచుటయు, వసంతమున విసరుపోతులు మృగమదామోదముల నగరుకలనలమమాని దన్నగవ మీదికి జిన్నిసరమూ లొప్పుటయు మున్నగాగల విషయము లేవియు నాయన దృక్పథమును దాటిపోలేదు వేసవిలో జానుదఘ్నములైన చెఱువులందు నిల్చి బకపంక్తులు చలనము, జలంకికసల్లలను నములుచు నెండ్రకాలి కిటికిన నెగసి, యొక్కించుక తొలగి కిత్రోడి దూటితినుట నాయన చూచుచున్నట్లు వర్ణించును వర్షమున బక్షులు జడత్వముచే దుదరెప్పల గన్ను విప్పి, నీరుముంగరలవలె ముక్కున గూడ, నోటగొంతోడియుచు గూటికత్తె సగ మెత్తుచు జానువులు వక్షము చేరఁ జెక్కనిదిప్పు ముమ్మన్నగా వణఁకుటయే తప్ప మిగిలిన చేష్ట లన్నియు మానుకొనుటయు, భానుమండలమును బ్రియరివేషము చుట్టుటయు నాయన పత్తిలకు సాక్షాత్కరింప జేయును శరత్తున “ప్రబిధగ్న కాల్యవని కీతాలాభము” గలుగుట నాయన యెఱుంగును వసంతమున గాయనులు భోగానంతరము ఘర్మకణంకచే హోమకేర లుప్పర పెత్తుటయునాప్తములు దెప్పరమగుటచే లోహకకటి ప్రకటీకరణంబు తిప్పుటయు నాయన కనుభవసిద్ధములైన కృత్యవిశేషములు కాబోలును. ఋతువుల నన్నింటి నాయన చక్కగానే వర్ణించినను వర్ష

కాలవర్ణనమున మతింతచాకచక్యమును ప్రకటించెను. అప్పుడు వంటవండు విల్లాంబ్రుప మ్లోకమును వర్ణించు నీ పద్యమాయన సూక్ష్మపరిశీలనకు పరమావధి

ఇల్లిల్లు దిరుగ నొక్కింతయు్ప శిఖి, యుబ్బె
    నే నింటిలో బూరియునీ విసరక
రాజదు, రాజిన రవులంకొల్పునతె
    కాని కల్లదు కూడు, దాన గలిగ
నేని మారగుటమం, దైన చెవ్వొగసుఖ
    భుక్తి సేయారదాభుక్తి కిడిన,
ప్రాగ్భోక్తలవె తీరు బహుఒనాన్నము దీర
    వారలకొదవు బునః ప్రయత్న

మాజ్యపటముఖ్యలయ మెన్నరు ఈపద్యమును జదువవప్పుడు సామాన్యజనసహజమైన యాశ్లేశము వాయన యొప్పుడు మాచెవాయని యాశ్చర్యమును, ఆయన సూక్ష్మతిసూక్ష్మ పరిశీలన కానందమును గలుగక మానదు.

సాధారణముగా గవులందఱును వర్ణనసందర్భములందు గవిసమయముల మాతగా గొని వింత వింతి భావముల వ్యక్తము చేయుచుందురు ఈ కవిసమయములు యథార్థములగునా కాదాయనునది వేఱు మాట కాని యవి సర్వకవిసంప్రయుక్తము లగుటచే మనకు వింతగా నుండకపోవుటయేకాక వర్ణ్యవిషయమును మఱింత స్పష్టము కావించును ఋతువులన్నిటికి సంబంధించిన కవిసమయము లిట్టి వెన్నో కలవు రాయలం దొక్కదానిని గూడ విడువకుండ వర్ణించుటలో గృతికాస్తుడు ఈయన వర్ణనలలో నీ సమయ పరిజ్ఞానము సర్వతోముఖముగా గోచరించును. ఒక్కొక్కసమయమును బురస్కరించుకొని యాయన యొక్కొక్క రమ్యమైన భావమును సృష్టించుచుండును గ్రీష్మమున దివసములు దీర్ఘము లగుట కవిసమయమునందే కాక శాస్త్రమునందు గూడ సిద్ధమైన విషయము అప్పుడు చెట్టిదంపు చెట్టచే హస్తము చెమర్చిల స్తకము దునీకిలం జేయుటచే సవరింప వశముకాక మదరుడు చెఱకువి ల్పుడమి బడ వైచెనట అది చెఱకుపండెడుకాలమగుట యీ భావము పుట్టుటకు హేతువయ్యెను చాతకములు మాగి యొక చినుకైన నుర్వికి డిగ్గనీకుండుట, ఘనుడు సకలమును నిద్రయుచ్చు కేశవుని నిద్రపుచ్చుట వారిన లియు విని యలకై దివి నిఱఞబల

చుట వర్షకాలమునకు సంబంధించిన సమయములు. తివయులు చొచ్చిన యింట్లనే యుండి కొమ్మపకు బుట్టినిర్ఘ్నరుట రాయలవానికే కాక యిప్పటికిని మాఱని సంప్రదాయము దీనిని బురస్కరించుకొని యాతడు వనిథిగమున ఘచే సగర్భములైన యర్కకిరణములు ప్రమాతికై మరల వాతని ధామము చేరెనని చక్కగా వర్ణించెను "ద్విజతి వారణ్యకధ్వని వినగ జేసి గర్భము సుఖద్యుతిము చేయ గనంగుటయు నిట్టి సంప్రదాయమే వర్షకాలమున బ్రొయ్యి రాజమిచే బోనము ప్రజకు జక్కులబోనముగుట రెవ్వ రెఱుంగని విషయము? ఈ సమయ సంప్రదాయముల నెఱుంగుట యొకటి, వాని నూతగా జేసికొని దివ్యములైన భావముల సృజించుట వేఱొకటి రాయ లిట్టివానిని ప్రత్యేకాభిమానముతో వర్ణించువా యనిపించును శరదృతువు రాగనే రాజమరాళములు క్రౌంచగిరి రంధ్రముద్వారా దశార్ణదేశములకు దిరిగివచ్చుట ప్రజలు శరద్వ్యాజపేయము లొనరింప గడగుదురు విష్ణువు నిద్రనుండి మేల్కొంచును కలశీసూను డుదయించి కలుషితాంభస్సులకు ప్రసన్నత చేకూర్చును ఈ సమయములు గంభీరములైన భావములకు ప్రభవములై రాయలవర్ణనములకు మహత్తరమైన యౌదార్యము చేకూర్చును సంతతికి దంతములు మొలపట్టగనే వనితలు పురుషసాంగత్యము నభిలషింతురను సంప్రదాయమును వనలక్ష్మి మాధవులయందారోపించి రాయలు మనోహరమైన భావమును వెలిబుచ్చెను ఇంక వసంతకాలము రాగానే లతావృక్షాదుల బుష్పింపజేయుటకై యవలంబింపబడు దోహదములలో నాయన వర్ణింపనిది లేదు వసంతవర్ణనలో నించుక తక్కువగా నగ మీా దోహదముల కోలాహలమే ఆయన దోహదపరిజ్ఞానము కూలంకషమైనది ఈ దోహదముల యాథార్థ్యము పరిశీలించుటకు బరిశోధనలు చేయించినచో ప్రభుత్వమువారిప్పుడు తలపెట్టిన వనమహోత్సవమున కెంతో వన్నె చేకూరును.

కాలము మార్పునకు గ్రహచలనము హేతువు ఏకాలమున నే గ్రహము లెచ్చటెచ్చట నుండునో జ్యోతిశ్శాస్త్రము వివరించును ఈ శాస్త్రమున జాతకభాగము మాట యెట్లున్నను సిద్ధాంతభాగము మాత్రము సిద్ధాంతమైనట్టిదే. రాయలవారి జ్యోతి

శాస్త్రపాండిత్యము గాఢమైనదే కాక యుక్తియును సంపాదితమైనది కూడ ననుట కీ కావ్యమున ననేక దృష్టాంతము లున్నవి ఆయన కాలమునార్పుడు గ్రహచారవివరములతో సూచించుచు జ్యోతిశ్శాస్త్రమునందలి తుక్కెక్కు యంశముపై నాయన తుక్కెక్కు వింత భావము నుత్పాదించుచుండెను వర్షకాలారంభము నాయన సూర్యుడు కర్కాటకమున ప్రవేశించుటలో నారంభించెను అంతలో నూరకుండక నూడన రొడకు చేరు తరణి భరణి ప్రమోదసంభాయియాట సోదాహరణముగా నిరూపించెను ఒక పద్యమున నాతడు శృంగారకరాగప్రశంస తెచ్చియింద్రగోపములను రమణీయముగా వర్ణించెను వసంతకాలావిర్భావము నాతడు తరణి యుత్తరాశకు దొలగుటతో సూచించెను "శిశిరవలకేకు దండెత్తి కేతువగుట మానమిలదోదుటుచితంబు, మేష. మేషపని యనగ నేల" యని మీనమేష సంక్రాంతుల నిరూపించెను ఈ ఋతువర్ణనలలో రాయలజ్యోతిశ్శాస్త్రపాండిత్యము గంభీరభావస్ఫూర్తికి మూలమగుటయే కాక వాని కడచెనొకానొక శాస్త్రీయ గంభీరిమ నొసగూర్చెను

రాయలు సార్వభౌములైనను సామాన్య మానవుల యాచార వ్యవహారములను, మనోభావములను సుఖదుఃఖములను చెక్కుచోట్ల నెంతో స్పష్టముగా వర్ణించియుండెను ఆయన ధనికుల మహాభోగము లందును సామాన్యుల స్వల్పసౌఖ్యములందును సమానాదరము ప్రదర్శించెను వేసవిలో జాతిఫల శకలములతో గలపి నానిచిన చేపముక్కలు తిన్న కనరువోవుటకై సంధ్యావేళల భోగులు "శీతకాంతారాభ్యంతరవాలుకాస్థితి హిమాంతర్నారికేళాంబువుల సేవించుటవలెనే యాతడు వర్షాన గురుసంతోషదని మున్నాగాగల యాకుకూరలతో గూడిన భోజనము చేసి, కొమల్ పాలమువో (గేపుల్ మెయుల్ నాక్" రెడ్లు మేకరువుల గుంపటి ముంచ పెట్టుటయు వివరించినాడు ధన్యులు తలుపి వెన్నెల బయళ్లను ననుభవించు భోగములతోపాటు కాపుగుబ్బెతల పెన్గుబ్బలను పువ్వాసలను హాలికులకు విసికిళ్లొంబివి క్లి కల్పించుటయు వినుతక వర్ణించెను ఆతని దృష్టి యతివిశాలమైనది, భావము సర్వసమత్వముతో గూడినది, శైలి గంభీరసుందరమైనది

ఋతువు ప్రవేశించినప్పటినుండియు క్రమముగా దల్లక్షణములు పెంపొందుచుండును చివరకా లక్షణములన్నియు నొకదాని వెంట నొక్కటి యదృశ్యమై యాగామి ఋతుచిహ్నములకు దావొసంగుచుండును ఈపరిణామమును రాయలు తన వర్ణనలలో గడుంగడు నిపుణముగా నిరూపించుచుండును శిశిరపయఃపానములైన కేతువృకమములకు వడగండ్లపాలవండ్లు రాలి బలాకాద్వ్యాళి సంప్రాప్తించి క్రమక్రమముగా పెరుగ ధ్వనియు గంభీరముయ్యెనట! ఇది బలాకామాలికాపరిచితములైన కాదంబినుల సాక్షాత్కరింప జేయుటయేకాక వర్షర్తువు క్రమముగా నెట్లు విజృంభించెనో తెలుపుచున్నది. ఎలగోలుజల్లుతో నారంభించి క్రమముగా మిన్నుమన్నేకముగా గురిసిన వృష్టిపరిణామ మీ పద్యమున నెంత సహజముగా వర్ణింపబడినదో చూడుడు

ఎలగోలుజల్లు మున్నెర పెళ పెటవా
  ల్పడి గాలివటింప్లు దడిసి చనగ
నట్టెతో వసగండ్లు కట్టావులు దుమార
  మావులురేచి రెంటెవదిరుం జన
మహిమూషవది నిల్చి పెంటసి బిట్టుజమిక
  కరవారిస్పృష్టి జేకటిగవలము
నుద్యల్లచేరుల గొడజకైపై సంకి
  జల్లుపై జల్లు పెల్లలు గొనగ
భూభిదాపాది దుర్నిరంధ్రారధో భరంపు
గడిమరుద్గుంఝ దరలక కదవ వంచి
నట్టువహోరని ధారాఘ దైర్ఘ్యమొంది
మిన్నుమన్నును నొకటిగా వృష్టిబలసె

అతి సూక్ష్మప్రకృతి పరిశీలనగున్న గాని యిట్టి వర్ణనము కావింప సామర్థ్యము కుదురదు ఇట్టి సామర్థ్యమును రాయలవారన్ని ఋతువుల వర్ణించు సందర్భములను బుష్కలముగా ప్రదర్శించినారు

రాయలవారి రచన సర్వత్ర, ముఖ్యముగా వర్ణన సందర్భములం దాలంకారికమై యుండును మొత్తము ఋతువులవర్ణనకై వినియోగింపబడిన రెండు వందలపద్యములలో నేదో యలంకారము లేని పద్యమే యుండదు అందును నుపమోత్ప్రేక్షల సంఖ్య హెచ్చు ఊహాబల మెంత విస్తారముగా నున్న నుత్ప్రేక్ష యంత రమణీయముగా నుండును రాయలవారి యూహావిన్యాసము నిదమిత్థమని వర్ణింప వలనుకాదు ఆ యూహాబలముచే నాయన స్వర్గమర్త్యములకు సంబంధము కల్పించుచుండును దినముల వెంబడి మున్ను మున్నీటిలో గ్రోలిన నీటిలో చేరిన బడబాఘట్టములవిరమ్మ ద దావములు తపులొక్కని పెటిలింప నార్పుట లేమా యనగా సాంద్రఘనాఘన గర్భగోళములు తటిద్భయంకర స్తనితములను స్ఫురింపెనట! వరుణాపెంబడిని రొంపిని ద్రొక్కుచుండ హాలికుల చరణముల తెవగినపసిడి చాయ కసుపులనీరుకట్లైలు దుక్కియందు వారి కుడిన బిరుదు లేమోయన నొప్పారెనట! సర్వసాధారణము కాకపోయినను గల్పన యెంత సహజమనోహరముగా నున్నది! కవిశ్రేష్ఠులకే కాక హాలికశ్రేష్ఠులకును గండపెండేరముల నిచ్చుచుండ మంచకేకబారాజు

గాజులో వాకిలిపార్శ్వభాగముదు గ్రీష్మమున వేసవు మీద బిందిపోయగా జాట్లుకాగిన కట్టాలికలె శాడిది రొంగయ భూమండలమును వెవమున మాపటి పండువెన్నెల చకోరపోత వితతిక్ జాపట్టి పోసిన విధముగా నొప్పారెను "గ్రామ గ్రామంబున నొక భామంతుని కీడిన దలుకదప్పరములు తిర్చె మేదిని సంపటిలో దామరలకలె నట్టెతెజ" నొప్పారెను ఇద్దుటి యుపమాన మెంత స్వతంత్రసుందరముగా మున్నది! కరగున శాలిమంజరులు పండి ముదురై వాడి ముంప్లతో గూడియుండును అది విష్ణువు నిద్రమేల్కాని భూదేవిపై నచుగిడగా నామె మేన బొడమిన పులకలకలె నొప్పారెనట! ఇట్టి భావనా సౌందర్యము లేని పద్యమొకటియు నీ ఋతువర్ణన లందు లేదు ప్రతి పద్యమునందు నేదో యొక విశిష్టమైన భావవిశేషము గోచరింపకుండ నుండదు ఇందు సహజమైన భావనకంటె నసహజములు సమయ బద్ధములు నైన యూహ లతిశయించినచోట్లును కొన్ని గలవు కాని యుదాత్తమైన గాంభీర్యముమాత్ర మెచ్చటను గొఱతపడి యుండలేదు.

రాయ లింత గంభీరముగా నీ వర్ణనల సాగించుచునే రొమె ప్పెప శృంగారమిశ్రితమైన చక్కని హాస్యరసోక్తుల వల్లడించినపట్లును కొన్ని గలవు గంభీరముగా మొదలిడిన వర్ణన సాగి సాగి చివరికి దరహాసము కలిగించు సరసోక్తితో ముగియుట యిట్టి సన్నిములలో గానబడు సరివాసే వర్షకాలమున రవిజాచి ఋతుచువారలకును గృకలాసములకును దృష్టిమిన్నలకె నిలుచుట మున్నగు విషయముల వర్ణించుచు జివరిగీతికు నాయన యెట్లు ముగించెనో చూడుడు

అతిథిసంఘంబునకు నీనివట్టె యెను ప
కగుపు లే గలగవిక్ నాగట్టు లెసగ
మంటిమిద్దెలవారికి మనుపనులకు
సెలకి వానీనవారికి నిదుర సెకియె

హైయారంభమున కిటి యుపసంహృతి కలుగునని మనము భావింపను ఇట్టి వంటవంటు నిల్లాండ్ర క్లేశమును వర్ణించి వర్ణించి యూతడా సీసమును,—

అజ్ఞపటముఖ్యలయ మెన్నరాల యూంచు
దారులయు మెన్న రంతిక కారజనిక
వచన వాంఛో గృహిణిరామి బనెకమురుడు
విసవిసకె యార్వ నొగిలి రజ్జడిని గృహాంలు

అని ముగించును. వేసవిలో దాంపు డోవరించు వికార చేష్టలు చూడుడు దప్పికచే బ్రపకేరి యమ్మయక్కయని కూలుచు దోయి లొగ్గి ప్రపాప్రపాలిక లొసంగిన పానీయముచే కవి తేర సుందటి వాక్యము లెన్నికే యాతడు "పాయుదుబ్బలున్ గడగొను కతుదీధిక లెగాదిగ మాడ"నారంభించునట! అట్టి పాంథుల జూచి పానీయము పోయు పాత్రముల మొగములపై విసరక సరసురాండ్రైన యా స్త్రీలు సన్నలచే నవ్వుచుందురట వారు నవ్వుట మాట లొట్లున్నను ఈపద్యము చదువునప్పుడు పఠితకు మాత్రము నవ్వు రాకతప్పదు

ఈవిధముగా రాయలవారి ఋతువర్ణనలు భావగాంభీర్యమునకును, ప్రకృతి పరిశీలన నైపుణికిని, సరస వాక్చాతురికిని నాలవాలములై యితరకావ్యములలోని వానికంటె నొకవిధమైన వైలక్షణ్యము కలిగియున్నవి అసలు రాయలవారి రచనమే ప్రౌఢమైనది ఈ వర్ణనలు మఱింత ప్రౌఢములుగా నున్నవి ఒక్కొక్క ఋతువునుగూర్చి యింత భావసామగ్రి యూయన యెట్లు చమత్కరించెనాయని చదువరుల కచ్చటచ్చట విస్మయము కలుగుచుండును కొన్నిచోట్ల వారిడొక వస్తువును వర్ణించి మఱికొంత దూరమేగిన తరువాత మరల నావస్తువునే వర్ణించుట కంగుకొనుచుండును ఒకే వస్తువునకు సంబంధించిన భావములన్నియు నొకచోట నుండుట సహజము అట్లు కాక యవి యందందు చెదరియుండుట కొంత వింత కలిగించును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారి ఋతువర్ణనలలో నితర కవుల పద్యములు కూడ గొన్ని చొచ్చియుండవచ్చునని యొక సందగ్ధమున జెప్పియుండిరి ఇందలి భావవైచిత్రిని, వస్తుగ్రహణమందలి పునరుక్తిని దిలకించినచో నీయభిప్రాయము సమంజసమే యని తోపక పోదు వర్షకాలవర్ణనమున వడగండ్లయు నింద్రగోపములయు వర్ణనములు రెండుమూడు చోట్ల గానవచ్చు శరత్తున దెల్లని మొయిళ్ళవర్ణనయు పునరుక్తమైయున్నది వసంతమునందలి దోహదక్రియల వర్ణన మొకే కర్తృకమై యుండుట కనబడుచున్నది కవులతో ప్రసంగించు సందర్భమున నాయావస్తువులగూర్చి వారిచే పద్యములు చెప్పించి యుంచి దనకు రమణీయములని తోచినవానిని రాయలు తన కావ్యమున జొప్పించెనేమో యనిపించును కేవలవర్ణనలే కాకున నట్లు చొప్పించినను గథాభాగమున విషయవిపర్యయము వాటిల్లదు అదియే యీ వర్ణన లింత దీర్ఘతరములుగా నుండుటకుగూడ హేతువేమో! కాని పద్యరచన మాత్రమంతట నొక్కతీరిగా నున్నది ఆ ప్రౌఢత, కూర్పు, పదప్రయోగము అన్నిపద్యములందును సమానమే అది పై యభిప్రాయమున కించుక బాధకము ఈ వర్ణన లెట్లైనను ప్రాయబడి యుండు జొచ్చినను రమణీయములును, అసాధారణములును, నుదాత్తములునై యున్నవనుటలో మాత్రము సందేహము లేదు.

# కోయిలమ్మ



శ్రీ కాళూరి హనుమంతరావు

ఈ తొలిసంజవేళ నవ
కోయిల కోయని నిద్రపోవునా
లేగమనస్సునన్ నిదుర
లేపెడువారలు?-ప్రాసఛందముల్
కై తలటంచు నెంచుకొని
కమ్మని తెన్గును బాడు సేయుమా
జాతిని నిద్రనుండి గుర
జాడ కవీంద్రుడు లేపినట్లుగా

తొలిగాలుల కౌగిలిలో
కిలకిల నగి, యుదయభాను కిరణమ్ములలో
మిలమిల మెరసెడి చిగురా
కులమాటున పాటపాడు కోయిలగంటిన్

నన్నపార్యసమాసముకన్న, కీట్సు
'ఊహా'కన్న రవీంద్రుని 'ఉషసు'కన్న
నామనోహారి మోవిపై నవ్వుకన్న
తీయగా, హాయిగా పాడె కోయిలమ్మ

"పలుకులందెల్ల మెత్తన తెలుగుపలుకు
తెనుగుకైతల మధురమ్ము తేటగీతి,
తేటగీతికకన్న నీ పాట యింపు,
ఆపకే ఆపకే నీదు అమరగీతి"

కర్కశ కఠోర శిలలెల్ల గరగిపోవ
నవని పులకింప మోడులే చివురులెత్త
కవుల హృదయాలు మారు మ్రోగంగ
నిపుడు
జగతి నింపవె నీదు స్వచ్ఛందగీతి.
ఈ యుషోదయసౌందర్య మినుమడించె
సంధ్య నీగాన పారవశ్యతను దోగ

కోయిలా కోయిలా యెందుకే యివేళ
నీదుగానమ్ములోన విషాదగతులు?

పొంగి హృదయమ్ములోనుండి పొరలిపోవు
నీవిషాద మాకసమంత నిండిపోయె
దాచుకోనేల నీవిషాదమ్ము నేడు
వింటివింటిని లే నీదు కంటినీరు.

చావు బ్రతుకుల మధ్య తేల్చంగలేక
మిగుల వేదనబడెడి హేమ్లెట్ను వలచి
ప్రేమమరణమ్ము పొందు ఒఫీలియాయు
నీవలెన పక్షిగాబోలు

పాడవే పాడవే హృది పగిలిపోవ
మధురమధురాతి మధురమౌ విధురగీతి,
జగతి మధురకావ్యములు విషాదభావ
పూరితములౌ, నిట్టూరుపుల పుచ్చు
నవియు.

క్షణము క్షణమును మారు నీ జగతియందు
రెండుమాత్రము మారకే యుండిపోవు-
కళ కళాకారకే యనెడు నీగాన ఫణితి,
ఆపగారాని నాదు కళాపిపాస

నందగోపాలు వేణుగానమ్ములోన
లీనమౌ రాధికాసతి లీల నేను
గాన పారవశ్యతను లోకమ్ము మరచి
యెంతసేపుంటినో యేమొ యెవ్వడెరుగు?

మొయిలుసందులలోనుండి పయికివచ్చు
కిరణమటుభావ మొక్కటి మెరసెన్నాదిని
కలుగుగాక పునర్జన్మ, కలుగుగాక
అమరమౌ ధన్యమౌ కోయిలమ్మ బ్రతుకు.

రాజకవి, విశిష్టాద్వైతి పారిజాతోపాఖ్యానమువంటి శాంతరసమహాగ్రస్తమగు కథను శృంగారప్రధానము గావించెనన్న తక్కిన కవులమాట చెప్పనేల! అతని కంటె ఘను డాచంట మల్లన్న యనిపించుకొన్న వాని కొడుకు విజయరాఘవుడు అతని కాలమున శృంగార మింకను విజృంభణలు చేసినది శృంగార పదపూర్వకములగు క్షుద్రప్రబంధము లెన్నియో బయలుదేరినవి కొందరు గ్రంథకర్తలు ఇతిహాస పురుషులగు మహానుభావుల చరిత్రల మాటుమూలలందు రంధ్రాన్వేషణ చేసి చేసి తమ శృంగార పిపాసను కొంత శాంతింపజేసికొనిరి అట్టివారిలో అహల్యా సంక్రందనము, శశాంకవిజయము, పార్వతీపరిణయము మొదలగు గ్రంథములు రచించిన కవులు ముఖ్యులు. మఱియు బహుగ్రంథములందు బ్రాహ్మణశృంగారము నీచాతినీచముగా వర్ణింపబడినది రఘునాథ కృతుల యందింటను ఈ విషయము గలదు. దీని కోసము ప్రత్యేకముగా తంజాపురాన్నదానపత్రమను యక్షగాన మొకటి రచింపబడినది దానినిబట్టి వారు తంజాపూరు సోమరిపోతుల సత్రములో తిండిమేయు చుండిన బాపనయ్యలు రూపాజీవులగు వేశ్యలను యాకలిచ్చుకొనవలెక తమ కంచిగరుడసేవాది పుణ్యములను ధారవోసెదమని వారినంటపడుచుండెడివారని తెలియును—ఈ యుగమున రాజులతో రంకు పోయిన కవయిత్రులుండుట ఇంకొక విశేషము స్త్రీ సహజమైన సిగ్గునుగూడ విడనాడి గ్రంథములు రచించినారు కాని స్త్రీకృతములగుటచే శృంగారము సైత స్త్రీప్రకృతి చాలమట్టుకు తేటతెల్లము కాగలదు ఈ యుగమున చెప్పుకోదగిన శృంగార కవు లిరువురు. క్షేత్రయ, చేమకూర. క్షేత్రయ మువ్వ గోపాలముద్ర భానుదత్తుని రసమంజరికి లక్ష్యకోశము చేమకూర వారి అపూర్వప్రబంధము ఇందు ముద్విధములైన నాయికాశృంగారము ఉలూచి—వరూథిని తలపింపజేయు ప్రగల్భ, కామేంగిత చిత్రాంగదముగ్ధ, ఆమెది తొలిచూపులలో సుభద్రసంగతి పూర్వరాగచేష్టితము రసధ్వని, రహోచితమైన అలంకారిక రీతియు నీతని విజయవిలాసకావ్య శృంగారగౌరవమునకు పోషకములు.

ఈ యుగప్రబంధములన్నియు పూర్వకావ్యముల కనుకరణములే వానిలో శృంగారమునుగూర్చి ప్రత్యేకము చెప్పుకోదగిన గొప్ప యేమియు లేదు. ద్వ్యర్థికావ్యములందు కవికి శ్లేషకోసము కష్టము చేయుకొనుటతో సరిపోవును కథకములు, స్థలపురాణములు ప్రాయికముగా భక్తిప్రధానములు రావిపాటి త్రిపురాంతకుని అంబికాశతకము, రామలింగని పాండురంగమాహాత్మ్యములో పరకీయశృంగారముగల నిగమశర్మోపాఖ్యానము మున్నగు రెండు మూడిందుల కపవాదములు యక్షగానాదులందు ప్రక్రియా, రచనాప్రణాళికయు వేఱుగాని తక్కిన దంతయు ప్రాతప్రబంధధోరణియే.

ఇక ఆధునిక యుగమునకు దిగినంతనే కవియే నాయకుడు నాయిక ఊహాప్రేయసి లేదా ఏ పొరుగింటి కోయరో అయితే అన్యాపదేశముగో మర్మకవిత్వ మవలంబించును మరికొందఱు బ్రదికియున్నవాళ్ళ భార్యలను నానాబాధలు పెట్టి ఆమె చచ్చిపోతే పాడుభూమితో కలక మొకటి వ్రాయుటయు ఆచారమై యున్నది. ఇట్లే నవయుగభావకవిత్వమున శృంగారము ముఖ్యముగా నుండి పోయినది అసలా శృంగారము రసపర్యవసాయి కా జేరాదు

పై చరిత్రనుబట్టి చూచినచో శృంగార మాంధ్ర వాఙ్మయరంగమున ప్రధానభూమిక నిర్వహించినట్లు తెలియగలదు ఏ వాఙ్మయమునను ఇంత శృంగార వ్యామోహము కవుల కున్నట్లు కనిపించదు కవిత్రయమువారినుండి నేటివారి దాని పరిణామ క్రమము సరసోన్ముఖమగుచునే వచ్చినది చివరికి కూచిమంచి జగ్గనిపాటిలో బూతుకూతల స్థితికి వచ్చిన దాంధ్రశృంగారము. రసికులను విసుగెత్తించినది అందుచే కవు లిప్పుడిప్పుడు ఇతరరసముల తెగ వ్రాయుచున్నారు.

# కష్టజీవులు 

శ్రీ పీరుభొట్లు సూర్యనారాయణ

పర్వతముల జంటవలె నున్నవీ యెద్లు
నడచుచుండి తూలిపడుచునుండె,
నెండుటాకులోని యీ నెలవలె లోని
యెముకలెల్ల జూచి యెంచవచ్చు.

సంచివోలెనుండె చర్మంబు, ముడుతలై
గాజుబిళ్లలట్లు గండ్లు మెఱయు,
చావలేదుగాని కళ్యావశిష్టమై
యూర్పుచుండె! బాధకోర్చుచుండె!

మూపుపైన కాదు మోకాలిపై కూడ
కాయ కాచియున్న కష్టజీవి,
యెన్ని పుట్ల భూములివ్వి పండించెనో!
వట్టిపోయె నాటి బలసమృద్ధి!

బడియ చేరబూని, యెదనెడ బాదుచు,
తోకనిఱిచి, యెక్లదోలుచుండె!
కఱకు కొఱుకవోలి కన్పట్టుచున్నాడు!
ఎచటి కివ్వి? వీని నేమి సేయు?

కొమ్ములుండి కూడ గుమ్మగానోపవు
బుస్సుమనవు, యూర్పు పోసికొనుచు,
శాంతమేమి! వీని సౌజన్యమేమిరా!
యిట్టిచిత్తవృత్తి యెట్టులబ్బె!

లాంగలములు గట్టి, లాగించి బండ్లను,
వీని కష్టఫలము విసువ మెసవి–
క్రియమొనర్చ దుదకు రెండు పుంజీలకు
పర్వతములవోలు వానియెద్లు

బలము దఱిగియున్న పశువుల రక్షింప
కానవంబులేవి? శాలలేవి?

ద్రవ్యమునకు నేడు దాసులైపోయిరి
రైతులౌర! ప్రేమ రహితులగుచు

పచ్చినీళ్ల కొఱకు బాధింపగా లేదు
పెట్టుగాక నీవు గొట్టుగాక
కండరములు నీదు కలిమికై పెచ్చించి
అసువులొండెయున్న పశువు లివ్వి

అడవులెల్ల దోటలయ్యె, నాడోటలు
పంటభూములయ్యె, బయళ్లు లేవి?
తిరుగ జోటు లేదు తిన మేతయా లేదు
పసరములకు నద్ది బ్రతుకు తెఱవు.

పేరుకనగ, చెఱకు పైరులు మెండయ్యె
ఆ పొగాకుతోట, లంతులేదు–
గింజపైరు కాదు కిట్టింపు—పసులకు
మేతలేదు–మనకు మెతుకు లేదు!

పశులమేతకనవు ప్రత్యేకముగ పెంచి
మేటివేయు కట్టుబాటు లేదు
వట్టిగడ్డి యెంత బలమైన మేతరా!
అదియునైన జాలినంత యేది?

పంజరములనుంచి పండ్లు గింజలు పెట్టి
పెంచుచుంటి వీవు పిట్టకదుపు
కష్టములకు నోర్చి కనిపెట్టుకొనియున్న
జీవులన్న నేల శీతకన్ను–

పొరపాట్లనుచు బడిచచ్చుచున్నాడు
మానవుండు బుద్ధిమంతు డౌట!
కరుణ చూపలేడు, తన కార్యమా యేమి?
ఈ కనీసధర్మ మెఱుగవలదొ!

# అమరు కాంధ్రీకరణము

★

శ్రీ విసుదవోలు వెంకటరావు

అమరుక మధుర భావమయందలి శృంగారరసోత్తర గ్రంథము శృంగారరసగుళిక యని శృంగార రసపేటికయని, శృంగార కంఠాభరణమని రసజ్ఞులు దీనిని గొనియాడెదరు ఇది కావ్యవిద్యావ్యాసక్తులకు ప్రభూషణము సంస్కృత హృదయులకు సంతతాహ్లాదకరము దీనిని శతకమని సంప్రదాయజ్ఞులు, లఘుకావ్యమని పాశ్చాత్య విమర్శకులు—ఖండ కావ్యమని నవీనభావుకులు వ్యవహరింతురు

అమరుక మాదిశంకరులు రచియించిరని ఐతిహ్యము అమరుకవి రచించియుండునని గ్రంథాంతరంగిక ప్రమాణము కవి యొక్కరైన నమరుకమాకృతి కర్తకమరత్వము సిద్ధింపజేసినది సుప్రసిద్ధ సంస్కృతాలంకారికులు, ఆనందవర్ధనుడు వామనుడు, నమరుకము నుదాహరించిరి కవితాప్రపంచమున శోక వ్యాసుడు కాళిదాసుకన్న ఘనయశస్సు గాంచిన మయూరుడు తన సూర్యశతకమున నమరు శ్లోకచ్ఛాయల ననుసరించె ననుటచేత నమరుక కావ్యప్రఖ్యాతి విశదీకృతమగుచున్నది దాక్షిణాత్య సంస్కృతకవి స్తుతికెక్కిన 'అమరుకవి' క్రీ శ. 8వ శతాబ్దికి ముందువాడనుట నిస్సంశయము.

అమరుకమందలి శృంగారము వర్ణనాప్రధానము గాదు ధ్వనిప్రధానము రచన మేకభావమాత్రగ్రథితము గాక, బహుభావసమన్వితము కేవలాలంకారికకవి సమయముల ననుసరించి, కావ్యసృష్టిసేయక, నాయకానాయిక రసభావసందర్భములను సన్నివేశములను రసోల్లసితములగునట్లు జీవకళాభాసురములుగా నొనర్చి, యమరుకవి శృంగార రసపోషణము కావించినాడు.

ఇందలి శృంగారము, మేఘసందేశ కావ్యాదుల యందలి శృంగారమువలె నేక భావగ్రథితము గాక, భాణములయందలి శృంగారమువలె, నసభ్యము గాక కుచశతకాదులయందలి శృంగారమువలె నుస్వాదరూపము వహింపక రసనిష్యందమై రసికజనాంతఃకరణ సంతతద్రవీకరణ కారణభూతమై వెలయుచున్నది

సంస్కృత భాషావాఙ్మయమున నమరుక మెట్టిదో ప్రాకృతభాషావాఙ్మయమున హాలుని గాథాసప్తశతి యట్టిది రెండును శృంగారరస ప్రాధాన్యములే రెండును, కేవల శృంగారరసముచే కావ్యరచన సాధ్యమని దారిచూపినవియే అయిన రసనిరూపణమున భిన్నపథకములైనవి దానియందలి శృంగారము, ప్రాకృతముగావున యమాయకపు పల్లెటూరి పడుచువంటిది రెండవది సంస్కృతము గావున నాగరకతయం దాఱితేరి, పలుపోకడ లెఱింగిన కులటాంగనవంటిది ఒకటి ముగ్ధశృంగారము చేయొకటి ప్రౌఢశృంగారము నిరూపించినవి.

## సంస్కృత వ్యాఖ్యలు

సంస్కృతమున నమరుకవ్యాఖ్యలు లిరువది మనకు లభ్యములగుచున్నవి 1

(1) రసికసంజీవని - అర్జునవర్మ
(2) అర్జునవర్మ - రసిక సంజీవిని
(3) రవిచంద్రుడు
(4) కోకసంభవుడు
(5) గోష్ఠపురీంద్రసూరి
(6) చంద్రఖంకౌలాధరుడు
(7) దేవశంకరుడు
(8) నందలాలుడు - భావబోధిని
(9) నందికేశ్వరుడు

1. *New Catalogus Catalogoram by Dr V. Raghavan. Published by the University of Madras 1951 Page 251 to 253.*

శ్రీగణాధిపతయే నమః శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1616 అగునేంటి ఆనందనం వత్సర శ్రావణ బ 10 రోహిణీ నక్షత్ర శు(లా)గ్నమందు యజనయాజనాధ్యయన, అధ్యాపక దాన ప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన యజుశ్శాఖ, అంగీరస బార్హస్పత్య, భారద్వా(జ)సగోత్రులైన కామంగోలని మారయరాజు అన్నయ్యగారుకు అన్నయ్య(కు) శ్రీ తుంగభద్రాతీరం భాస్కర క్షేత్ర మందుల శ్రీపంపా విరూపాక్ష దేవుండు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి అనువున్నాగాను ఆచంద్రార్కతారకం రక్షిం(చు)ను మంగళయ్యగన్ శ్రీ శ్రీ శేయున్

ఈశాసనము హంపీమహాక్షేత్రమున నైన బస్తియాలయమున కెదురుగనున్న రాతిపైనున్నది ‡ ఇందు పేర్కొనబడిన అన్నయ్యయే, అన్నమరాజు కాదగును. ఇతని తాత మారపరాజు నాతనిచే విషయము తెలుపుచున్నది మఱియు ఇతడు ఆపస్తంబసూత్రుడనియు భారద్వాజసగోత్రుడనియు, హంపీక్షేత్రవాసియనియు, దెలియుచున్నది. కామంగోలనే, 'కామకోలను' అయినది

ఈ యన్నమయ్య కృతినుండి పెటలోకసీసపద్యము మాన ప్రబంధరత్నాకరిలో నుదాహృతమైనది అది త్రిపురాంతక దేవునిమీర్చిన దైవస్తుతి ఆ పద్యము నిందుదహరించుచున్నాను.

"తిమిరిరాశికి దిక్కు తిరుగు చక్రంబులు
మెట్టుల బదిలమై మెఱయు తేరు
బహుముఖంబుల పేర్చుపచరించు సారథి
ప్రాసీదూపగ రానివాయువగులు
గట్టిరై తీగనక్క యదీర్ఘ విల్లుగమ్ము
ప్రగిహితంబుగ ప్రోతమారునారి
విజయానుకూలమై విలసిల్లు బాణంబు
నరిరేనికోటుల సంఖ్యబలము
తనకు నబ్బుటయును బుద్రత్రయము గెలిచి
పృథులవిఖ్యాతి గైకొన్న రథికవరుడు
జయము తేజంబు ధృతియు శ్రియము మెలర్ప
మనల గరుణావిధేయుడై మనుచుగాత."

## 2. తాళ్ళపాక తిరువేంగళప్ప

అన్నమరాజు కృతి తరువాత పేర్కొనదగినది తాళ్ళపాక తిరువేంగళప్ప యాంధ్రీకరణము ఈ యాంధ్రీకరణ మముద్రితము గ్రంథము చివర నిట్లు చెప్పుకొనియున్నాడు

"ఇల దాళ్ళపాక నన్నూల
తిలకుడు, శ్రీ వెంకటేశ దీక్షిత సుతు డు
జ్జ్వల కవితాంధి తిరువేం
గళప్ప యమరుకను తెలుగుగా రచియించెన్"

తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులై ప్రఖ్యాతి జెందిన తాళ్ళపాకవారి వంశీయుడగు నీ తిరువేంగళప్ప క్రీ శ 1600 ప్రాంతమున నున్నవాడు. ఈత గ్రంథమును తిరుపతి వెంకటేశ్వరునికి కృతి నొసగియున్నాడు ఈ యమరుకాంధ్రీకరణము సంపూర్ణముగ నున్నది చాలవఱకు చంపకములు, ఉత్పలములు వాడుకరైనవి. లెక్కకుగా మత్తేభ శార్దూలములు, కందములు వాడబడినవి. కేవల శృంగారరస ప్రధానమగు నిట్టి కావ్యమున, వీరరసానుగుణ్యములగు మత్తేభ శార్దూల వృత్తముల వాడిక సరసముగా నుండదను తలంపున నీతడు వానిని విడిచియుండవచ్చును అముద్రితము గాన దీనినుండి కొన్ని పద్యముల నుదాహరింతుము. మూలమున ప్రతి పద్యమునకు ముందు వ్యాఖ్యాతోరిక భావంలో చిన్న వివరణము వచన రూపమున నున్నది

"శ్రీరుచిరాంగనాక్రమవిచిత్ర
విభూషణభూష చందనో
దార విలాసదీపితముసై, యసి
తోత్పల కాంతి మించి, శృం
గారరసంబు దోచెనన గన్నుల
పండువులైన మేని యా
యాశ్చరములాను వేంకటనగాధిపు
డీవుత మాకు గోరికల్"

"వచనము— శృంగారరసప్రధాన మమరుక కావ్యము. శృంగారము - సంభోగము, విప్రలంభము అని రెండు విధములు అందులో సంభోగ శృంగారం

‡ దక్షిణ హిందూదేశ శాసన సంపుటములు. 4 సంపుటము. No. 271 ను. 60 పుట హంపీక్షేత్ర శాసనములు.

5 జయంతి రామయ్య. (1861-1941)గారు

గ్రాంథికవాదాగ్రేసరులు, రామయ్యపంతులుగారు, అమరుకమును క్రీ శ 1902 ప్రాంతముల నాంధ్రీకరించి, అప్పటి రాజకీయోద్యోగ నిర్బంధముచే ముద్రింపక, క్రీ శ 1932 లో పలువురు విద్వత్ప్రభువుల ప్రోత్సహింప ముద్రించిరి ఇది మూలముతోగూడ, సరసమైన యాంధ్రీకరణముతో ముద్రితమైనది

6. వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి

ఈతడు తిరుపతి సంస్కృత కళాశాలయందు సాహిత్యాచార్యుడు ఇటీవల కీర్తిశేషుడు ఈతని యమరుకమున పద్యములు భారతిలో ప్రకటితములైనవి

7. చెఱుకూరి కాళహస్తీశ్వర శర్మ

సులభశైలిలో రచితమైన యీ యమరుకాంధ్రీకరణము 1931 లో 'సమదర్శిని' సంవత్సరాది సంచికలో ప్రకటితమైనది.

8. మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి

విశాఖమండలమున పాలకొండ వాస్తవ్యుడగు మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రియను కవి దీనిని చక్కగ భాషాంతరీకరించియున్నాడు ఇది ముద్రితమయ్యు ప్రకటితము కాలేదు

9 గుఱ్ఱము సుబ్రహ్మణ్యము
ఎమ్. ఏ. బి యల్

వీరి యమరుకాంధ్రీకరణము క్రీ శ 1938 లో ప్రకటితమైనది. శ్రీయుత కొటారి వెంకటేశ్వరరావుగారి టీకతోగూడ వెలయుచున్నది తెనిగింపు సమీచీనముగ నున్నది.

10 వింజమూరి శివరామారాయకవి

11. పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రి

12. ఘట్టిలక్ష్మీనరసింహశాస్త్రి

వీరు మువ్వురు నీ తరువాత నమరుకము నాంధ్రీకరించిరి ఈ యాంధ్రీకరణముపై విమర్శకాభిప్రాయమిది 1 శివరామయ్యగారి రచన ద్రాక్షాపాకము

2 పెనుమర్తివారి రచన కదళీపాకము.

3. ఘట్టివారి రచన నారికేళపాకము.

(భారతి 20 సం 7 సం 98 పుట 1948 జూలై) ఘట్టివారు వేరు తమ రచనమును పునర్ముద్రణము చేసియున్నారు అది భారతిలో విమర్శింపబడినది

వీరుగాక శ్రీ వండూరి శివరావుగారును, కీ శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును దీనిని తెనిగించిరట ఇంకను నా గమనమునకు రాని యనువాదములుండవచ్చును నాకు దెలిసిన దేర్చితిని

సంస్కృత గ్రంథానువాదముల చరిత్ర తెలుసుకొనుటకేమి, ఏక కావ్యమును గ్రహించిన కవులను గూర్చి సమగ్రముగను, సప్రమాణముగను పరిశ్రమ చేయుటకేమి, అట్టి గ్రంథసూచికలు ముద్రితాముద్రిత వివరణముతో గూడ నెంతయు నావశ్యకమై యున్నది అట్టి యాంధ్రగ్రంథసూచికా సర్వస్వ రచనను ప్రోత్సహించుటకే వ్యాసముద్దేశింపబడినది



# వియోగాగ్ని

★

'మధుశ్రీ'

ఊహాకతీతమైనది, మహోన్నతమైనది, దివ్యశక్తి సం
దోహములోఁ గూడినది, దుఃఖములేనిది, భీతిగాని, సం
దేహముగాని చేరనిది, తృప్తికరమ్మయి సర్వలోక స
మ్మోహనమైన యట్టిదియపో! ప్రణయ—మ్మది యెంత గొప్పదో!

చెలి! నీనా ప్రణయామృతాంబునిధి వీచీమాలికా డోలికా
వళి నిన్నున్ మఱి నన్ను నేదొయొక స్వప్నభ్రాంతిగా మేఘ వీ
థులపై దేవవధూ రహస్థలులయందున్, ద్రిప్పె, నానాఁటి వే
ళల యందెద్దొయొకప్డు—స్వర్ణసుమముల్ ప్రాలెన్ శిరోజాగ్రమ్ములన్.

అంతియ! దానితోసరి! మహావిష దంష్ట్రిలఁ బోలు తత్స్మృతుల్
స్వాంతమునందునన్ నిలిచి శాశ్వతదైన్య విషాద వహ్ని సం
క్రాంతిగఁ జేయుచున్నవి—సుఖమ్మొటువంటిదొ యేనెఱుంగఁ గ
ల్గాంత విలోచనా! కనికరమ్మును జూపెడివార లేరుపో!

నీవొక దేవకన్యకవు! నేనొక రాక్షసమూర్తినేమొ? దే
వీ! వరమిచ్చి మెచ్చితివి, విభ్రమచిత్తు దనై ప్రమోదరే
ఖావధి దాఁటలోపలనె కన్నులు విప్పితిఁగాని నిన్ను బా
ష్పావృత దృష్టియుక్త నయనాంచలసీమలయందుఁ గంటినా?

ఒకఁడెవఁడో మహోజ్జ్వల మహోన్నత సత్కవిరాజు వానినా
టకమున సృష్టిచేసిన రటన్నటివౌదువు నీవు, కాని—మా
యకు వశమైన లోకములయందె ట్లైనను నిన్నుఁబోలు నా
యిక జనియించెనా? హృదయమందలి భ్రాంతులు వాశ్చెఁ గ్రాంతులై!

ఇది వియోగాగ్ని! —దీని నీవే యొసంగి
నావు—నీ బహూకృతి శిరసా వహింతుఁ;
గాని, వన్నెల విసనకఱ్ఱ! 'వనున్ మ
తెంత కాల మహర్నిశ లేద్వు మనము?

# కలగ[illegible]గంప

## శృంగార రసమంజరి

వికృతి భాద్రపద శుద్ధములో ఆంధ్రగానకళా పరిషత్తు (రాజమహేంద్రవరము) వారిచే ప్రచురింపబడిన క్షేత్రయ్య పదముల గ్రంథములో అనుబంధముగా 'శృంగార రసమంజరి' ప్రకటింపబడినది నా సంపాదకత్వమున వ్రాయబడిన "తొలిపలుకులో (పుటలు 53 - 58) 'క్షేత్రయ్య పదములు - అలంకార శాస్త్రము' అను శీర్షిక క్రింద నాటికి నాకు లభ్యమైన విషయము ననుసరించి ఇట్లు వ్రాసితిని "ఈ వివరణకు 'శృంగార రసమంజరి' యని పేరు దీని కర్త యవరో తెలియదు ఆంధ్రసారస్వతములో క్షేత్రయ్యపదముల స్థానమును, విలువను నిర్ణయించుచు ఈ గ్రంథకర్త చేసిన సేవ చిరస్మరణీయము" ఈ వివరణయంతకు కర్త యొక్కరే యను యుద్దేశముతో అట్లు వ్రాసితిని కాని సుమారు నాలు రోజుల క్రిందట ఈ వివరణయొక్క కర్త లిద్దరని స్పష్టమైనది ఈ విషయమును క్లుప్తపరచుచున్నాను

కొలదినముల క్రిందట విజయనగరము వెళ్ళియుంటిని అచ్చటి మహారాజావారి సంగీత కళాశాలలోని శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారిని—నాట్యాచార్యులను— కలసితిని ప్రసంగసందర్భములో వారు, శృంగార రసమంజరీ కర్త, గుడిపాటి కోదండపతి యని, వారి గ్రంథము 1901 లో అచ్చైనదని, అది వారివద్ద కలదని చెప్పి నా కది దయతో ఇచ్చిరి ఈ విషయము శ్రీ వీరేశలింగము పంతులు గారు వారి ఆంధ్రకవుల చరిత్రలో మూడవ భాగములో వ్రాసియున్నారనికూడ వారు సెలవిచ్చిరి ఈ విషయము వారు నాకు తెలియజెప్పినందుల కెంతయు కృతజ్ఞుడను.

అందుపైని రాజమహేంద్రవరములోని శ్రీ గౌతమీ గ్రంథాలయమునకు జని అచ్చట యా విషయమై కనుగొనగా, 1901 లో అచ్చైన శృంగార రసమంజరియే గాక, 1872 లో అచ్చైన 'సంస్కృతాంధ్ర రసమంజరి' కూడ లభ్యమైనది. ఇది వింజమూరి కృష్ణమాచార్యులవారి చేతను బ సీతారామాచార్యులవారిచేతను పరిష్కరింపబడి, వింజమూరి కృష్ణమాచార్యులవారిచే రచింపబడిన మకరంద మనెడి వ్యాఖ్యానముతోడ, ఈ. పుష్పరథ సెట్టిగారిచే చెన్నపురిలోని స్వకీయ కళారత్నాకర ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రకటింపబడియెను ఇందు భానుదత్త కవికృత సంస్కృత రసమంజరి మూలములోని ఒక్కొక్క శ్లోకమునకు ప్రతిపదార్థము వ్యాఖ్యానము (మకరందనామవ్యాఖ్యానము) తరువాత గుడిపాటి కోదండపతికవిచే ఆంధ్రీకరింపబడిన వచనము, పద్యము వరుసగా ఇయ్యబడినవి ఇందలి ఆంధ్రభాగము మాత్రమే 1901 లో అచ్చువేసిరి దాని వివరణ మిట్లు "సురతాని కోదండపతి కవివరప్రణీతంబైన శృంగారరసమంజరి— ఇయ్యది పండితులచే పరిష్కరింపబడి వంకాయల కృష్ణస్వామిశెట్టివారి స్వకీయ శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రచురింపబడియె చెన్నపట్టణం–1901 సం॥ వెల అ ౹ా" ఈ తెలుగు రసమంజరికిని పైన చెప్పిన 1872 లో ముద్రితమైన దానిలోని తెలుగు అనువాదమునకును అచ్చటచ్చట కొద్దిపాటి భేదములు కలవు కాని సముదాయముమీద ఒకటే గ్రంథము. 1872 లో అచ్చైనదే శుద్ధముగా యున్నదని చెప్పవలసియున్నది ఇదివరలో నాకు లభ్యమైన భానుదత్తుని సంస్కృత రసమంజరి, నాగర లిపిలో ముద్రితమైనది. అందు అనంతభట్టుచే రచింపబడిన వ్యంగ్యార్థ కౌముదియను వ్యాఖ్యానము కలదు. తెలుగులిపిలో ముద్రించిన ఈ సంస్కృతాంధ్ర రసమంజరిలో అనంతభట్టు వ్యాఖ్యానములేదు.

శ్రీ గుడిపాటి కోదండపతి నందవరీకనియోగి బ్రాహ్మణుడు. ఆశ్వలాయన సూత్రుడు, భారద్వాజ

గోత్రుడు, సురతాని బిరుదాంకితుడగు వేంకటమంత్రి పౌత్రుడు, రంగయామాత్యవరు వీరమాంబయను పుత్రుడు ఇతడు మూడుగుచ్ఛములుగా వెలిగించిన శృంగార రసమంజరిలోని తృతీయగుచ్ఛము చివరను గల గద్య ఇట్లున్నది

"ఇది శ్రీమత్కోదండరామ వరప్రసాదలబ్ధ చతుర్విధ కవితాధురీణ భారద్వాజగోత్ర పవిత్ర, వేంకటమంత్రిపౌత్ర, రంగయామాత్య పుత్ర, సత్కవిజనమిత్ర, సకలకలాలవిత్ర, గుడిపాటి వంశ పయఃపారావార రాకాసుధాకర, సురతాణికోదండ పతి ప్రణీతంబైన శృంగారరసమంజరియందు, చత్వారింశత్పద్యదళంబులుం చతుర్దశవచనకేసరంబులుం గల కుసుమపంచకంబుచే నొప్పారు తృతీయగుచ్ఛము"

మరియు నీ గ్రంథాంతమున నివ్వబడిన రెండు పద్యముల నుదహరించుచున్నాను

"శ్రీరంగనాయకీ నత
నీరజముఖపాదములను నే బూజింతున్
శ్రీరంజిలు రసమంజరి
మారిస్తుతి పారిజాత సుమమంజరిగన్ "

"శ్రీకరనందనరీ కాగ్రగణ్యుండు మహిమీఱు
గుడిపాటి వంశభవుడు
బిరుదుగా నభ్యంచె సురతాణి పేరంది
మహితుడౌ వేంకటమంత్రి పౌత్రు
డతులితుడౌ రంగయామాత్యు తనయుండు
వీరమాంబానంద వృద్ధికరుడు
వెంగన్న వెంకట శ్రీనిధులనుజాతు
భావిల్లు కోదండపతి ఘనుండు
సరస కవితా చమత్కార సార్వభౌము
డవని శ్రీరంగధాము దయాశ్రయుండు
వెలయు రసమంజరిని రచియించెనందు
సరవిగా తృతీయగుచ్ఛంబు దనరు.

ఇతడు 'శ్రీరంగనాథ దయాశ్రయుండ' నని 'శ్రీరంగేశ్వరి రంగనాయకిని సేవింతు నెల్లప్పు' డని కృత్యాదియందు శ్రీరంగనాథుని శ్రీరంగనాయకిని స్తుతించుచు పద్యములు వ్రాయుటచేతను శ్రీరంగ ప్రాంతములయందలి వాడుండెనేమో యని చెప్పవచ్చును. కృత్యాది పద్యములలో ఇవి కొన్ని.

"శ్రీరంగనాయికా వర
సారంగమదార్ద్ర పత్రజయశాసన, శే
షారుచిరభుజాంతరయగు
శ్రీరంగేశ్వరు డభీష్టసిద్ధు లొసంగున్ "

"నందనరకంక జలధిపూర్ణేందులీల
రసికుడగునట్టి సురతాణిరంగ ఘనుని
సుతుడు కోదండపతికృతి సుమతియొసర్చు
మంజురసపుంజ శృంగారమంజరిగను "
"మధుర మాధ్వీక భణితిగా మధువితీర్ణ
వాసనావాక్య సౌరభ్యవాసరవిక
మధుకరానందకర రసమంజరియును

దనరు కవిరాజశర్ధావతంస ముకుచు "

ఇది ఏ కాలమువాడో తెలియదు "ఇన్నూఱు సంవత్సరముల క్రిందట నుండియుండు నేమో" యని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడియున్నారు

క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన శృంగార రసమంజరికిని దీనికిని కొన్ని ముఖ్యములగు భేదములు కలవు క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన దానిలో రెండు భాగము లున్నవి పుటలు 219 - 287 లలోని వచనములో నియ్యబడిన నాయికాది లక్షణమంతయు కోదండపతి శృంగార రసమంజరిలోని వచనభాగమే. తరువాతి 288 – 358 పుటలలోని "(క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములు – సమన్వయము)" అను శీర్షిక క్రింద అచ్చైనదంతయు చాలవరకు కోదండపతి కృతిలోనిదే యని చెప్పవలెను మొదటి రెండు పుటలలోని మూడు పద్యము లా కవి వ్రాసినవే భానుదత్తుని రసమంజరిలో లక్షణము - వచనము, శ్లోకములతోను లక్ష్యము శ్లోకరూపమునను ఇవ్వబడినవి కోదండపతి, శృంగార రసమంజరియందు లక్షణమును వచనమున తెలుగులో వ్రాసి, లక్ష్యములను పద్యములలో వ్రాసెను క్షేత్రయ్య పదములతో ముద్రితమైన శృంగార రసమంజరిని రెండు భాగములుగా నెవరో త్రెవ తీసికొని, వ్రాసిరి. నాయికాది లక్షణములకు లక్ష్యములుగా వ్రాయబడిన పద్యములను వదలి ఎక్కువగా క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములను జూపియున్నారు. సురతాని కోదండపతి క్షేత్రయ్య పదములగురించి ఏమియును వ్రాయలేదు. అందుచేత

ఈ విధముగా శృంగార రసమంజరిని విడదీసి వచన భాగమును—(లక్షణముల నిచ్చిన భాగమును)— మాత్రము మొదట వ్రాసి లక్ష్యముల క్రింద సుప్రసిద్ధ పదకర్తల పదములను చేర్చి రెండవ భాగముగా విడదీసిన వారెవరో ఇంకను స్పష్టపడలేదు

మరియు రెండవ భాగమున నీ యజ్ఞాత సంపాదకుడు, లక్షణములను దెలుపు కోదండపతికృత వచనము వ్రాసి, తరువాత "ఇందు నుదాహరణము 'నన్నేటికి బొమ్మ సేసె వానికద్దికి గె' అనునట్టి స్వంత రచనలను చేర్చినాడు ఈ వచన భాగమంతయు శృంగార రసమంజరి కర్త వ్రాసినదే దీనినే క్లుప్తపరచి మొదటి భాగముగా (319—87 పేజీలలో అచ్చువేసినది) ఈ సంపాదకుడు వేరే వ్రాసియున్నాడు అందుచేత నీ వాక్యములలో కొంత భేదమున్నది (పట్టికలు ప్రక్క పుటలో)

ఈ మూడు పట్టికలను, శృంగారరసమంజరి భాగమున క్షేత్రయ్య పదములతో, గ్రంథ విస్తరభీతిచే ముద్రించలేదు విషయమంతయు లక్ష్య వివరణముం దిక్కబడినదేగదా యని ఈ విభాగములు గల పట్టికలను అచ్చువేయుట మానుటయైనది కాని ఇప్పుడు ఈ శృంగారరసమంజరి కర్త యెవరను నిరూపణ విషయము వ్రాయుచుంటిని గాన కర్తలిద్దరు కలరని, మొదటివారు కోదండపతికవి యని, రెండవవారు మువ్వగోపాల పదములను, ఇతర పదములను శోధించి వాటికి లక్షణములను నిర్ణయించి విధిరీతుల విషయవిభాగ మొనర్చినవా రని చెప్పవలసి వచ్చినది గాన, ఈ యజ్ఞాత పురుషునిగురించి వివరముగా వ్రాయుటకై ఈ పట్టికలను కొంత ఉదహరించియున్నాను

ఈతడు కోదండపతికవికంటె బాగా తరువాతి ఆధునికుడైయుండును ఏమనగా, మొదటి పట్టికలోని అచ్చు గ్రంథములలోని రెండవదానిలో గల అంకెలనుబట్టి పదములను పరిమాడగా క్షేత్రయ్య పదములకు వ్రాసిన తొలిపలుకులోని 86 పుటలో ఉదహరించిన 1862 లో ముద్రితమైన గ్రంథములోని పదసంఖ్యగా కనిపించుచున్నది. అందుచేత ఈతడు 1860 ప్రాంతమునకు తరువాతివాడే వ్రాసియున్నట్లు చెప్పవలె నేమో. 1862 నకు పూర్వమచ్చైన గ్రంథమేదైన యొకటియుండి అందును ఇదేరీతి పదసంఖ్యయుండినచో 1862 కు పూర్వుడని చెప్పవలెను ఈతని పేరు, ఊరు, కాలము ఇప్పటికి నాకు తెలిసినంతవరకు నిర్ధారణ కాలేదు.

విక్రృతి మాఘమాస 'భారతి'లో 162 పుటలో శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు సభాపతయ్య పదములగురించి వ్రాసిన వ్యాసములో ఇట్లు ఫుట్‌నోటులో వ్రాసియున్నారు " క్షేత్రయ్య పదములతో చేర్చి ముద్రించిన 'శృంగారరసమంజరి'ని రచించినదియు, క్షేత్రయ పదములలో గొన్నిటికి నాయికా, నాయక రసభావాది నిర్ణయము గావించినదియు, నీ పదములకు (సభాపతయ్య పదములకు) వివరణాదికములు వ్రాసి ప్రకటించిన శ్రీ నీ మా. తిరువేంకటాచార్యులవారే యని తెలపదగియున్నది. దేయువిధమయిన ప్రామాణికాధారము లభించునంత వఱకు నీ యూహ సరియయినదే యనుటకు బయి ప్రకటనములోని వాక్యముయొక్క సాక్ష్యము చాలు ననుకొందును"

పైన నేను వివరించినదానిఁబట్టి 'శృంగార రసమంజరి' కర్త గుడిపాటి కోదండపతి యని సప్రమాణముగా చెప్పవలసియున్నది రెండవవా రెవరను విషయములో విషయసామ్యమునుబట్టి శ్రీ తిరు-ంకటాచార్యులవారయిన కావచ్చును కాని, సభాపతయ్యగారి పదములను 1884 మార్చి నెలలో చెన్నపట్టణములోని శ్రీవాణీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది అందీ పదములకు 'శ్రీ తిరువెంకటాచార్యులవారు సంగ్రహించిన యాంధ్ర వాక్యరూపమయిన నాయికా నాయకాది లక్షణములును, రసమంజరి యుదాహరణ శ్లోకములును నొసగబడియున్నవి' పరిష్కర్తలచే 'గ్రంథమునకు దొలుత గావింపబడిన ప్రకటనము'లో ఇట్లున్నదని తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారి వ్యాసములో గలదు.

4. . భావజ్ఞేతలకు సమితము విశదపడునట్లు ముందు ఉపోద్ఘాతమును, ఆవతల రాగము, తాళము, పదము, నాయకి, నాయకుడు, రసము, సంచారిభావము, అలంకారమును, ఒకటి వెంబడి నొకటి క్రమముగాను — కదుపట రసమంజరీ శ్లోకోదాహరణములను చేర్చి—అతిప్రయాసమునకు మెచ్చుకోదగి

## పట్టికలు *

I మరియు, నీ సంపాదకుడు, ఇంక కొంతో క్రమదీపికవి లక్షణములకు లక్ష్యములుగా తా నిచ్చిన పదములను అకారాదిగా ఒక పట్టిలో నిచ్చినాడు. అందులోని క్షేత్రయ్యపదములకు తాను సంపాదించిన రెండు అచ్చుప్రతులలోను, రెండు వ్రాతప్రతులలోను నిర్ణ్యబడిన పదసంఖ్య నిచ్చి నాయికా భేదములను కూడ ఇచ్చియున్నాడు ఉదాహరణముకై కొన్ని పంక్తులను వ్రాయుచున్నాను.

II ఈ విషయముసే మరియొక రీతిని విభాగించి పట్టికగా వ్రాసియున్నాడు. లక్షణములలో చేర్చోన్న శయనలోగల వివిధనాయికాదులను వరుసగా చెలుపుచు లక్షణమునకు ఎదురుగా లక్ష్యముయొక్క ప్రారంభము నిచ్చినాడు

III మరియు ఈ విషయమునే ఇంకొకరీతిని పట్టికగా ఇచ్చియున్నాడు

| (1) లక్ష్యము | అచ్చు | | వ్రాత | | లక్షణము |
|---|---|---|---|---|---|
| అందగాడనౌదు వేర ఆదివరాహ | ౧౮ | ౧ | ౮౭ | ౧౫౫ | సామాన్య, ఖండిత |
| అనుకోప సేమున్నది-యక్కర | ౭ | ౧౧ | ౨౫ | ౬౩ | స్వీ ప్రౌఢ దివ్య |
| పరదేశమున జేసిన పనులిందు | ౧౨౬ | ౧౫౩ | ౩౧ | ౭౦ | స్వీ ప్రౌఢ ప్రేమగర్విత |
| మంచిదానవే చెలియ మాటలకు | | | ౬౧ | ౨౨౦ | ప పరోఢ ఉపపతి కడకు పరిహాసం |

| (2) లక్ష్యము | నాయికా భేదము |
|---|---|
| వచ్చేటికి బొమ్మ సేరే, వాని వద్దికి | స్వీయ, ముగ్ధలో, నవోఢ |
| ఈమేను జీవునకు యింత ప్రియమాయెవ్ | స్వీయ, ప్రౌఢ-విప్రలబ్ధ |
| అలుకదీరెనా నేడైన మా | స్వీయ, సఖిప్రౌఢ-పరిహాస లక్షణము |
| ఇటువంటివాడని నే దెలియ | ప, పరోఢ-గురుమాన |
| దినము లిటువలె వచ్చె | సా; మధ్యము |
| ఇంత దయగలవాని | సా, దూతీసంఘటన |

### మువ్వగోపాలపద నాయికా పట్టి

| (3) | స్వీయ | పరకీయ | సామాన్య |
|---|---|---|---|
| ప్రౌఢ-తృప్త<br>ప్రౌఢ-అతృప్త | నేటిదే కలయికరా<br>నన్ను నీవు దలచేది న్యాయ | ఇప్పటికీలాగున నున్నా<br>ముద్దుపెట్టవేమిగా | మనసు నిల్పడవాయ<br>ఒకసారికే ఈలాగైతే |
| సౌందర్య గర్విత | తోయ్యలి నావిభుడవు | తెలియనైతి నమ్మ | గడియ గడియకు |
| ముగ్ధ-స్వాధీనపతిక | ఇన్నాళ్లు మల్లాడిన దిందు | అక్కరోసిర్వలివారు | సామికి సరియాన్వరే |
| ముగ్ధ-విప్రలబ్ధ | కొంచెకత్తెలా మీరు | ఎక్కడి కేస్తను లెక్కడి సెనరు | ఒక్కటైన కాని నాయక్కడ |
| సఖీ-ఉపాలంభన<br>... ... | మగవాని కట్టిపెట్ట మనవలెనా | పెలతా అతడు అలిగెదే | పిలవచ్చితివే సామినీడవాక్కి<br>... ... |

వ్రాసి అచ్చువేయించి ప్రచురించితిమి ఇందు వ్రాయబడియుండు లక్షణములు భరత రసప్రకరణములోని శ్లోకములకు తెనుగు తాత్పర్యము గాని వేరు కాదు అలంకార లక్షణములను తెలుపునపుడు చంద్రాలోకములోని శ్లోకములను తెలుగు మాటలుగా మార్చి వ్రాసియున్నాము ఈ లక్షణములను సంస్కృతమునందు చూడవలెనన్న భరత రసప్రకరణమును చంద్రాలోకమును చూడవలయును క్షేత్రయ్యగారి పదములు మొదలయినవానిలో లక్షణోక్తములైన కొన్ని పదములను సంగ్రహించి యుందలి లక్షణములతోడ జేర్చి ముద్రింప యత్నించియున్నాము"

దీనినిబట్టి 1884 నాటికి ముద్రింప యత్నించియున్నట్లు తెలియుచున్నది అప్పటికే దీనిని వ్రాసియుండవచ్చును పైన నేను సూచించిన రీతిని ఈ యజ్ఞాత రచయిత 1860 ప్రాంతములయందే రచియించియుండునేమో యని ఊహింపవలసియున్నది మరియు రెండు అచ్చుపుస్తకములలోను ఒకదానిలో 160 రెండవదానిలో 200 పదములుండెనని పట్టికను బట్టి చెప్పవలసియున్నది 1862 లో అచ్చువేసిన గ్రంథమందు 228 పదములుండెను మొదట 200 లే దొరికినవని, విచారించగా ఇంకను 28 లభ్యమైనవని అందు ప్రకటింపబడియున్నది అందుచేత 200 గల ఒక పుస్తకమంతకంటె పూర్వమున యుండియుండెనేమో యని తోచుచున్నది అందుచేత 1884 నకు అధమ మిరువదేండ్ల క్రిందట, ఈ యజ్ఞాత పురుషుడు, ఈ పట్టీల వివరాలను వ్రాసియుండవచ్చునేమో యని తోచుచున్నది మరియు అతడు వ్రాసిన వ్రాత ప్రతిలో నాటి కచ్చులోలేని క్షేత్రయ్య పదములను సుమారు 90 పైని వ్రాసియున్నాడు

మరియు, సభాపతయ్యగారి పదములకు వ్రాసిన వివరణాదికముల గురించి శ్రీ తిరువేంకటాచార్యులవారు వ్రాసినది పై నుదహరింపబడినది. అందలి లక్షణములు, భరత రసప్రకరణము, చంద్రాలోకములోని సంస్కృతలక్షణశ్లోకములకు తెనుగని చెప్పబడియున్నది ఈ యజ్ఞాత సంపాదకు డుపయోగించిన లక్షణములు గుడిపాటి కోదండపతి రసమంజరికి వ్రాసిన తెలుగు వచనరచన కాని, భరతరసప్రకరణ, చంద్రాలోకములలోని సంస్కృత విషయమునకు శ్రీ తిరువేంకటాచార్యులవారు వ్రాసిన వచనరచన కాదు ఈ ఆచార్యులవారే యీ యజ్ఞాత పురుషుడైనచో ఈ సభాపతయ్య పదములలో వ్రాసిన తెనుగు లక్షణములనే యిచ్చియుండును ఏమనగా వారి ప్రకటనమందు చివర ఇట్లు వ్రాయబడినది "క్షేత్రయ్యగారి పదములు మొదలయినవానిలో లక్షణోక్తము లయిన కొన్ని పదములను సంగ్రహించి యుందలి లక్షణములతోడ జేర్చి ముద్రింపయత్నించియున్నాము" ఈ లక్షణము వేరు గనుక, శృంగార రసమంజరిలోనివి, గుడిపాటి కోదండపతిచే వ్రాయబడినవి గనుక, వాటిని అజ్ఞాత సంపాదకు డుపయోగించియున్నాడు గనుక, ఆచార్యులవారీ యజ్ఞాత పురుషులు కారని తోచుచున్నది

మరియు సభాపతయ్య పదముల వివరణ ప్రణాళికకు 'శృంగార రసమంజరి' రెండవభాగమందలి వివరణ ప్రణాళికకు భేదము కనబడుచున్నది, ముఖ్యముగా, సభాపతయ్య పదముల వివరణలో "కడపట రసమంజరీ శ్లోకోదాహరణములను జేర్చి" యని యున్నది ఇవి సంస్కృతమున మాత్ర మిచ్చిరో, తెలుగులో శృంగార రసమంజరి కర్త యగు కోదండపతి ఆంధ్రీకరణముకూడ నిచ్చిరో తెలియదు (గ్రంథము లభింపక చూడలేదు) ఎట్లైనను అజ్ఞాత పురుషుడు శ్రీ తిరువేంకటాచార్యులవా రగుటకు ఇవి బాధకములనియే నా యూహ అందుచే యీ విషయ మింకను ఇదమిత్థమని చెప్ప వీలులేకున్నది.

---

శ్రీ విస్సా అప్పారావు.



సంపాదకుడు

శ్రీ వ్యాఖ్యామృతానన్దతీర్థ

కలగ ఆంజనేయశాస్త్రి

# గ్రంథవిమర్శనము

## గాంధీ—మార్క్సు

శ్రీ కిశోరీలాల్ మష్రువాలా—అనువాదకులు వేమూరి ఆంజనేయశర్మ ప్రకాశకులు సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితి హైద్రాబాదు దక్కను వెల రూపాయిన్నర

ఈ రోజుల్లో కమ్యూనిజాన్ని గురించి విరివిగా చర్చలు సాగుతున్నాయి అల్లాగే గాంధీతత్వాన్ని గురించి వేర్వేరుగా చర్చించిన పుస్తకాలనేకం ఉన్నాయి ఈ రెంటినీ గురించి సమగ్రపరిశీలనచేసి తారతమ్యం చూపించిన గ్రంథాలు తెలుగులో లేవే లేవని చెప్పవచ్చును ఇందుచేత ఈ పుస్తకం తెలుగు పాఠకుల కెంతైనా ఉపయోగపడగలదు

కిశోరిలాల్ మష్రువాలా ఈ పుస్తకంలో గాంధీవాదాన్ని గురించి, కమ్యూనిజాన్ని గురించి తారతమ్యపరీక్ష చేసి ఈ రెండింటినీ గురించి సమగ్రంగా చర్చించారు

గాంధీవాదానికీ, కమ్యూనిజానికీ లక్ష్యాలు ఒకటే కావచ్చును కాని ఆచరణలో రెండిటికీ ఉత్తరదక్షిణ ధ్రువాలకున్నంత తేడా ఉంది గాంధీ ఆధ్యాత్మికవాది అందుచేత ఆయన దృక్పథంలో ఈశ్వరవిశ్వాసము, అహింస మొదలయినవాటికి ప్రాధాన్యం ఏర్పడుతుంది

మార్క్సు గతితార్కిక భౌతికవాదికావడం వల్ల ఇతని వాదంలో పై విషయాలగోలే కనబడదు కాని, ధనస్వామ్యసమాజం తనలో సహజంగా అంతర్గతములై ఉన్న విరుద్ధశక్తులద్వారా, వర్గకలహం ద్వారా వర్గరహిత వ్యవస్థవైపు ముఖముపోతున్నదనీ, ఉగ్రమైన అవగాహనద్వారా వర్గరహిత సమాజంస్థాపనకోసం ప్రయత్నించడమే విప్లవపంథా అవుతుందనీ మార్క్సు అభిప్రాయము ఇతని అభిప్రాయంప్రకారం ఆవిధమైన సమాజస్థాపనకు సాయపడని కార్యక్రమం అంతా విప్లవ వ్యతిరేక పంథాయే అవుతుంది

గాంధీమార్క్సుల ఇద్దరి దృక్పథాలలోను ఒక ప్రధానమైన విభేదం కనబడుతుంది సాధన గతమైన గుణదోషాలు సాధ్యంలోకూడా సంక్రమించి తీరతాయని గాంధీ సిద్ధాంతము, అందుచేత ఒక లక్ష్యసిద్ధికోసం అవలంబించే సాధనం కూడా పునీతంగానే ఉండాలని గాంధీజీ అంటాడు మార్క్సు దృక్పథంలో ఒక లక్ష్యంసమాజ శ్రేయస్కరమైనప్పుడు దానికోసం అవలంబించే కార్యాచరణ ఎల్లాంటిదైనా దానివిషయంలో ఆక్షేపణ ఏమీ ఉండదు

మార్క్సు దృక్పథం జీవితానికంతటికీ సంబంధించినది గాంధీజీ సిద్ధాంతం ఒక్క రాజకీయ స్వాతంత్ర్యసంపాదనకోసమే ఉపయోగపడిందని అనుకోకూడదు ఇదికూడా జీవితంలోని ప్రతిసమస్యకు ఒకనిర్దిష్టమైన దృక్పథంఏర్పరుస్తుంది. అయితే మార్క్సిష్టు మాత్రాలప్రకారం అన్ని జీవితరంగాలలోను ఏర్పడే దృక్పథాలను గురించి సమగ్ర చర్చజరిగిఉండడంవల్ల అవి సులభంగా తెలుసుకోడానికి వీలేర్పడుతున్నది

మష్రూవాలా ఆవిధంగా కళాది వివిధరంగాలలో ఏర్పడే గాంధీదృక్పథాలను గురించి ఈ పుస్తకంలో వివరంగా చర్చించి ఉండలేదు—పైగా ఈ పుస్తకంలో మార్క్సిజం ఒక సుస్థిరమైన దృక్పథంతో వివరించినట్టుకూడా కనబడుతుంది

ఈ పుస్తకం చదువుతూంటే చాలా చోట్ల తెలుగు హిందీ అనువాదంలా కనబడిపోతూంటుంది. అనువాదకులీ లోటు ముందు సంస్కరణలోనైనా సవరించుకోగలరని ఆశిస్తున్నాము

## జాతిరత్నాలు

[కథలసంపుటి]

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, సుశీలవాడి, హుమాయత్ నగర్, హైదరాబాద్, (దక్కన్) వెల రూపాయిన్నర

ఆంధ్రదేశంలో సుప్రసిద్ధమయిన స్త్రీలపాటలలోని కొన్ని ఇతివృత్తాలు తీసుకుని శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు సరళగ్రాంథికభాషలో అయిదుకథలు వ్రాశారు ఈ ఆ అయిదు కథల సముచ్చయమే ఈ 'జాతిరత్నాలు'

ఆంధ్రదేశీయమైన ప్రాచీన జానపద మహిళా సారస్వతంలో చక్కని జాతిరత్నాలున్నా, అవి ఇంతవరకు అచ్చుతప్పుల తడకలుగా నిలిచిన గుజిలీ పుస్తకాలలోనే నామమాత్రంగా మిగిలి ఉన్నాయి వీటినిగురించిన పరిశోధన చాలా స్వల్పంగా జరిగింది చింతాదీక్షితులుగారు మొదలైనవారెవరో ఇద్దరు ముగ్గురు మాత్రమే వీటినిగురించి కూలంకషమైన పరిశ్రమచేసి వ్యాసాలు ప్రచురించారు.

శ్రీ సరస్వతీదేవిగారు పాత పాటలలో నించి ఎన్నుకొన్న ఈ అయిదు ఇతివృత్తాలలోను చక్కని

ఆంధ్రదేశీయమైన సంప్రదాయం తొణికిసలాడుతున్నది. వీరు స్వీకరించిన, ఊర్మిళాదేవినిద్ర, లక్ష్మణదేవరనవ్వు, సర్వాంగదచరిత్ర, ధర్మరాజు జూదము, సత్యభామ సరసము, సుప్రసిద్ధమైనవి

శ్రీమతి సరస్వతీదేవిగారి కథలన్నీ గ్రాంథికంలోనే వ్రాసినా—కథలలో చాలాచోట్ల ఆయా పాటలలోని ఘట్టాలన్నీ ఉదాహరించారు ఈ ఉదాహరణవల్ల, సహజమైన కథ చాతుర్యంవల్ల ఇవి చదువుతూంటే—ఆ పాత పాటలు చదువుతున్నట్టే ఉంటుంది ఈ పాటల పారశ్యము, కథాకథనవైఖరి కొన్ని కొన్ని చోట్ల ఉత్తమ కవితాస్థాయి స్ఫురింపజేస్తాయి లక్ష్మణదేవర నవ్వులో నిద్రాదేవి తన్నుగురించి చెప్పేమాటలు దీనికి ఉదాహరణగా తీసుకోవచ్చును

"అష్టదిగ్గజములను – ఆది మహాబుధుల
వైకుంఠవాసులను వదియింతు నేను
సప్తసాగరముల చవుటి పడియలను
కోటీనదులను భ్రమియింతు నేను
పక్షుల జాతులను పర్వతమ్ములను
వృక్షాలపైనుండి విహరింతు నేను
నరుల నెవ్వారును నను గెల్వలేరు"

ఈ కథలు చదువుతూంటే సహజంగా పాఠకులకు వీటికి సంబంధించిన పాతపాటలు చదవాలనే కుతూహలం కూడా కలుగుతూంటుంది

ఇల్లిందల సరస్వతీదేవిగారి 'జాతిరత్నాలు' అన్నది కథాభిమానులేగాక ప్రాచీన జానపద మహిళా వాఙ్మయాభిమానులు కూడా తప్పక చదవవలసిన పుస్తకం ఈ రచయిత్రి క్రమంగా ఉత్తమమైన ప్రాచీన స్త్రీ సారస్వతం కూడా ప్రకటింపగలరనీ, అవిరామంగా మరుగున పడిపోతున్న ప్రాచీన మహిళా వాఙ్మయమాధుర్యం తెలుగువారికి అందించగలరనీ ఆశిస్తున్నాను—

ఈ గ్రంథానికి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసిన పీఠిక వారి విశేష పాండిత్యానికి నిదర్శనంగా ఉన్నది

## విజయదశమి

[పదికథల సంపుటి]

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ప్రచురణ : రాఘుబుక్ డిపో, రాజమండ్రి. వెల రూపాయిపావలా

దీనిలో విజయదశమి, నలుగురిపిల్లలు, మానసుందరి మొదలైన పది కథలున్నాయి ఇవి అన్నీ ఇదివరకు సుప్రసిద్ధపత్రికలలో ప్రకటింపబడినవే అని పీఠికారచయితలు శ్రీదేవరపల్లి కేశవరావుగారు వ్రాస్తున్నారు.

వీటిలో ఎక్కువగా కూలిజాలి చేసుకొని జీవించే బీదజనం, మధ్యతరగతి ప్రజ, పాత్రలుగా వస్తారు

ఈ రచయితలో చక్కని కథనశక్తి ఉన్నది జాతీయము, సుసంస్కృతము అయిన చురుకైన వ్యావహారిక భాషకూడా వీరి కథనశక్తికి తోడై కథలన్నీ ఒక గుక్కలో చదివించి వేస్తుంది

అయితే చాలావరకీ కథలన్నిటిలోను రచయిత వ్యక్తిత్వం మాటి మాటికీ పాఠకులకు అడ్డు తగులుతూ ఉంటుంది ఒక్కొక్కప్పుడు పాత్రసంభాషణలు మొదలైనవన్నీ రచయిత ముఖతః బయలు వెడలుతున్నట్టే వినిపిస్తాయి మరీ అడుగున పడిపోయిన వ్యక్తులవద్దనలో రచయిత వారి జీవితాలను గూర్చి ఊహించి చిత్రిస్తున్నట్టు కనిపిస్తుంది

ఈ కథలన్నిటిలోను 'నలుగురుపిల్లలు' 'బస్సులో' అనేవి రెండు చాలా మంచికథలు పుస్తక ముద్రణాదికం ప్రశస్తంగా ఉన్నది

## శ్రీమద్రామాయణోత్తరకాండ

[కవిత]

దేవళ్ల కృష్ణరాయచౌదరి కాటిపాక, రాజోలు తాలూకా, వెల 3 రూపాయలు

ఈ రచయిత పొలం దున్నుతూండగా ఒక నిక్షేపం దొరికినదట! ఆ నిక్షేపంలో ఒక సంస్కృత తాళపత్రగ్రంథం మాత్రమే కనిపించినది ఆ గ్రంథంలోని కథ ఆధారంగా తీసుకుని రచయిత ఈ పద్యకావ్యం రచించారు దీనిలోని కథకు ఉత్తరకాండ కథకు అక్కడక్కడ కొన్ని భేదాలున్నాయి

ఈ రచయిత కావ్యం సాంప్రదాయక కవితామార్గంలో నడిచిపోతుంది పద్యాలలోని సంస్కృతాంధ్ర పదప్రయోగాల శిష్టత ప్రత్యేకంగా ప్రశంసింపదగినది కవిత అంతా కథాకథన ధోరణిలో సాధారణస్థాయిల్లోనే నడిచిపోతుంది గాని రసవత్తర ఘట్టాలలో కొత్తదనమున్నట్టైన కవితాగాంభీర్యం గాని కవితలో ప్రత్యేకత గాని కనబడవు

ఈ క్రింది పద్యాలు వీరిశైలికి ఉత్తమోదాహరణలుగా తీసుకోవచ్చును ఇది తృణబిందాశ్రమవర్ణన ఘట్టము

"కళవ్వన కేక వేయుచురు,
కీరమరాళ మయూర కోకిల
జివ్వక రగిపాటు, కెలకేగియు
దేవియలాడుచుండు ..."

జవ్వను లెల్ల బర్వులిడి
    జంటలు జంటలు గుంపు గూడియున్
గ్రొవ్విరులున్ ఫలమ్ములూగి
    గోపికయు లేని విలాసినుల్ మొగిన్ "
పున్నాగ పుష్పముల్ పుణికి పేసలు జల్లి
    సరసమ్ములాడెడు సఖియ యొకతె
సన్న జాజులు కోసి సరులు సక్కగ జేసి
    ముదితకొప్పున గూర్చు ముగుద యొకతె
మందార దామమీ మగువకు నగు
    నని బైచి నగు జగ వనిత యొకతె
బిబ్బోకవతి నీడు బిగిగుబ్బలకు బోని
    గజనిమ్మపండ్లని కవియు నొకతె
చివురు జొంపమ్ములం దుమ్మ చెల్వయోర్తు
పాదపులం డాగి కలరుత్తు పాలతి యొర్తు
డాగుమూతల యాటాడి డయ్యెనోర్తు
రమణు లిట్లు క్రీడించిరి రాముముందు "

---

## భిక్షావతి

[కవిత]

వజ్ఝల కాళిదాసు ప్రతులకు జంషెడ్ పూర్ — టీచర్ వెల రూపాయిన్నర ఇది పద్యాత్మకమైన చిన్న ఖండకావ్యం భిక్షావతి అనే పేరు భిక్షగత్తె అన్న పదానికి సంస్కృతానువాదంలా కనిపిస్తుంది భిక్షగత్తె అన్న పదానికి తెలుగులో భిక్షమెత్తుకొని జీవించే స్త్రీ అని అర్థం చెప్పవచ్చును కాని సంస్కృతంలో దీనికి ఈ అర్థం చెప్పడానికి వీలులేదు ఒకవేళ ఏదో ఒక అర్థం చెప్పదలచినట్లైతే 'భిక్షముకలది' అనే అర్థమే చెప్పాలి ఈ ఖండకావ్యంలో ఒక భిక్షగత్తె దౌర్భాగ్య జీవితమె కథా వస్తువు ఎంతఅడిగినా అన్నంపెట్టే వాళ్లు లేక ఈ భిక్షగత్తె చచ్చిపోతుంది దీనికి పూర్వం ఆమె శిశువు కూడా చనిపోతుంది ఇందుచేత ఈ పేరు కావ్యానికి సార్థకంగా కనిపించదు సంస్కృత వ్యాకరణం ప్రకారం 'భిక్షము కలిగినది' అనే అర్థంతో ఈ పదం ఎల్లాగో అల్లాగ సాధించవచ్చునుగాని, ఆ భాషలో ఇది జాతీయమయిన ప్రయోగం కాజాలదు

భిక్షగత్తె జీవితం వర్ణ్యమయినపుడు పాఠకులకు సహజంగా కరుణారసమూర్తి కలగాలి కాని ఈ కావ్యం చదువుతూంటే జిలిబిలి పదాలమాటున కరుణారసం అడుగంటిపోతూన్నట్లనిపిస్తుంది.

అయితే రచయిత కవనంలో అక్కడక్కడ చిన్న చిన్న దృశ్యఘట్టాలు హృద్యంగా కళ్లకు కట్టేశక్తి కనిపిస్తుంది కావ్యంలో నాలుగేళ్లు నిండని పసిబాలిక తనచేతనున్న పళ్లు భిక్షగత్తెకు ఇవ్వడం కోసం ఆమె దగ్గరకు వస్తుంది. ఆ పసిబాలికను వర్ణించే ఈ క్రింది సీసంలో రచయిత వర్ణనశక్తి పరిశీలించవచ్చును

చివురుపాదములపై చిన్నారి వెండి ము
    వ్వలు ముద్దుగా ఘల్లుఘల్లుమనగ
మొలత్రాడునన్ గ్రేలు మురిపెంపుబంగారు
    బిళ్ల క్రొంబసుపుకే జిలుగులీన
శ్రీకారములవోలు చెవులకు నీలాల
    లోలకుల్ క్రొత్త యందాల నీయ,
వర్ధచంద్రాకృతి నలరారునుదుటిపై
    నందారుబొట్టు విన్యాసమమర,
వంగరాలురులదాల్చి యున్నపూలు
రంగురంగులు క్రొత్త సౌరభములీన,
నాలుగేండ్లు నిండని పసిబాలయొకతె
వారికడవిచ్చె కరుణావతారమనగ

---

## పునస్సంధానము

[పద్యకావ్యము]

పి హనుమయ్య బి ఏ (ఆనర్సు) ప్రతులకు ఆంధ్రా బుక్ హౌస్, జాలయ్య మార్కెట్, గుంటూరు వెల లేదు

ఇది సలీము నూర్జహానుల ప్రణయపరిణామం వర్ణించే కావ్యము సలీము నూర్జహాను భర్తను చంపించి ఆమెను వివాహమాడిన కథ చరిత్ర ప్రసిద్ధమే

అయితే ఈ కావ్యంలో నూర్జహానుభర్తను వధించిన సలీమును అనేకవిధాలుగా దుర్భాషలాడి నిందిస్తుంది తరవాత సలీము తాను ఆమెను చిన్నప్పటి నించీ ప్రేమించిన విషయం తెలియచేస్తాడు — అయినా ఆమె అతని మాటలు చెవిని పెట్టదు కాని అతడు ఆత్మహత్య చేసుకోబోయేసరికి ఆమె మెత్త బడుతుంది

చరిత్రమాట ఎల్లాగున్నా కావ్యంలో వర్ణించిన తీరుమాత్రం ఏరికిద్దరికీ సముచితంగా లేదు నూర్జహాను చివరికి సలీమును వివాహం చేసుకున్నది. తరవాత నూర్జహాన్ కే భారత సామ్రాజ్యభారం నిర్వహించినదని కూడా చరిత్ర చెబుతున్నది' చరిత్ర ప్రసిద్ధమైన ఈ ఇతివృత్తానికి అనుకూలంగా నూర్జ

పోను పశువుల ప్రేమ పరిణతి చిత్రిస్తే ఈ గాథ ఇంకా స్వభావోచితంగా ఉండేది.

పద్యరచనలో అక్కడక్కడ ప్రథమ ప్రయత్న సూచనలు కనిపిస్తున్నాయి. ఈ క్రింద ఉదహరించిన పద్యాంశంవంటి రచనలు ఈ కావ్యంలో చాలా సత్యస్తగా కనిపిస్తున్నాయి. ఇది మూర్ఖపోను పశువును నిందించే ఘట్టంలోనిది.

"బ్రదుకును సాంతమున్ విడచి
స్వామిపదంబుల కంకితమ్ముగా
వదలిన త్యాగమూర్తి కవివార్య
గభీర పరాక్రమాఢ్యునిన్
బదనలు భుక్కి వీంచు నొక
బల్లెపుపోటును గుండెకాయకై
నదిమి బహూకరించితివి
అంతియె చాలునులే! మహాప్రభూ!"

---

## ప్రకృతి సౌభాగ్యము-లేతచీకటి వెలుగులు

[కవిత]

కర్రా సుందరరామశాస్త్రి, బోర్డు హైస్కూల్, పేరూరు తూర్పు గోదావరిజిల్లా, వెల: ఒకరూపాయి

ఇది ప్రత్యేక విశిష్టతగల ఖండకావ్య సంపుటి. రచయిత అనేక విషయాలను గురించి ఖండకావ్యాలు వ్రాశారు కాని, అవి సామాన్యంగా నేటి ఖండ కావ్యాలలో ఎక్కడా కనబడవు. టార్చిలైటు, కిరోసిన్ ఆయిలు, రైలు, అగ్గిపెట్టె, సబ్ మెరైన్ మొదలైన ఆధునిక జీవితావసర వస్తువులే వీరు తమ కావ్యాల్లో వర్ణించారు. ఈ రకమైన వర్ణనకు నేటి కవితామార్గంలో వీరొక క్రొత్తదారి వేశారనవచ్చును.

ఈ రకమయిన విషయాలమీద ఆధునిక పాశ్చాత్యకవులు అనేకులు ఉత్తమమైన ఖండకావ్యాలు రచించారు. జీవితంలో నిత్యము ఉపయోగపడే వస్తువులుకూడా ఉత్తమ కవితారచనకు ప్రోద్బలం కలిగించవచ్చునని వీరు సోదాహరణంగా నిరూపించారు.

కర్రా సుందరరామశాస్త్రిగారు తమ ఖండకావ్యాలన్నీ ఒక తరహా ఖులాసాధోరణిలో వ్రాసుకుపోయారు — అందుచేత ఈ కావ్యాలన్నీ ప్రాస్తావిక ఖండకావ్యాలుగానే మనం చదువుకోవాలిగాని వీటిలో సామాన్యంగా కవితలో కనబడే ఉదాత్తత వెదకబోవడం న్యాయం కాదు.

ఆంగ్లకవితలో (*Light verse*) ఖులాసా కవిత చాలా ఎక్కువగా ఉన్నది. పెద్దకవులు అనేకులు ఈ విధమైన రచనలు చేశారు. మన ప్రాస్తావిక పద్యాలు, సమస్యలు, అష్టావధాన శతావధాన కవిత్వాలు, ఇంచుమించుగా ఈ వర్గంలోకే వస్తాయి.

ఈ కవి బాల్యసహజమైన ఒకవిధమైన అమాయిక దృక్పథంతో ఆయా వస్తువుల వర్ణనలు చేశారు. అక్కడక్కడ మాత్రం అంతర్గర్భితంగా హాస్యం మెరుస్తూంటుంది. మోటార్ కారునుగురించి వీరు వ్రాసిన కొన్ని పద్యాలలో ఈ విషయం పరిశీలించవచ్చును—

"చోదకుడు ప్రక్కనుండగ
మోదముతో తిరుగుచుండు సుందర చక్రం
బాదుకొని కారునడుపం
గాదగు వారెంత భాగ్యగరిమ గలారో!

సూటుబూటుల డాక్టరు చోద్యమునను
మేఘరంజిల మీద నమేయలాఘు
వంబునను కారునడుపుచు వచ్చుచుండ
నరుడో! హేరాయణుండో నా నెరుగరాదు!

కారుండెడి వా పుట్టువో
ధారుణి బుట్టుటకు యోగ్యతాసాంద్రు డతం
డేరికి నోయది గలుగం
గారా దిల ప్రాక్సుకృతము గాదలలేకన్"

'స్టవ్' అనే శీర్షికలో వీరు వ్రాసిన ఈ కందంకూడా వీరి ధోరణికి తార్కాణంగా తీసుకోవచ్చును

"స్టవ్వు వెలిగించి వదలిన చప్పుడేక
తానతం గూర్చి ప్రణవ నాదంబునందు
పరక వేయు చానందంపు దరగలుబ్బి
స్వాంత ముమ్ముఖమాను వేదాంతమునకు!"

---

## భా ర తి

[సంస్కృత మాసపత్రిక]

సంపాదకులు—సుజనదాసస్వామి, ఏమ్ ఏ భారతిభవన్, గోపాల్‌జీకా రాస్తా, జయపూర్, రాజస్థాన్ సంవత్సర చందా, మూడు రూపాయలు విడిప్రతికి 6 అణాలు

ఇది సంస్కృతం నేర్చుకునే విద్యార్థులకేగాక పండితులకు గూడా ఉపయోగపడే సంస్కృత మాసపత్రిక. దీనిలో సిరియా—లిబనాన్ దేశాల పరిచయం మొదలుకొని ప్రాణాయామరహస్యము, శ్రీరామనవమి మొదలైన విషయాలమీదకూడా చక్కని వ్యాసా లున్నాయి.

మాఘకవిని గురించి, ఏకనాథుని గురించి రచించిన సమగ్రమైన విమర్శక వ్యాసాలు. ఈ సంచిక లోని వాటికి, సంస్కృతకవిత సామాన్యమైన సాంప్రదాయిక ధోరణిలోనే నడిచిపోతున్నాయి.

సంస్కృతంలో రచనాపాటవం అలవరచుకో గోరేవారందరికీ ఈ పత్రిక బాగా ఉపయోగిస్తుంది.

# శ్రీమద్భగవద్గీత

వ్యాఖ్యాత: శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు

ఆరవ ముద్రణము

సంస్కృతమూలమూ, తెలుగున టీకాతాత్పర్య విశేషార్థ
వివరణములు గల 400 పుటల గ్రంథము గీతాధ్యయన
పరులకు మిక్కిలి ఉపయుక్తమైనది

ఖద్దరు బైండు

**వెల రూ 4-0-0 లు.**

తపాలాఖర్చు రు 0-9-0

---

గాంధీ మహాత్ముని

# ఆత్మకథ

ప్రథమ, ద్వితీయ సంపుటములు

[చతుర్థ ముద్రణము]

శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారి తెనుగింపు

ఖద్దరు బైండు

ప్రతి సంపుటము పోస్టేజితో సహా వెల రు **5-9-0**

ఒకేసారి 2 సంపుటములు పోస్టేజితో రు **12-10-0**

**ఆంధ్ర గ్రంథమాల, పోస్టుబాక్సు నం 212 మదరాసు.**

Printed & published by S Sambhu Prasad at the Andhra Patrika Press,
No 7, Thambu Chetty Street, Madras. Editor S Sambhu Prasad



# ఆనందమయమైన గృహజీవనం

అతని ముఖం ఆనందములో ప్రకాశిస్తున్నది. ఆమె ప్రేమతో తయారు చేసిన 'టీ' ఒక గ్లాసు త్రాగడం అపుడే ముగించాడు. పగలల్లా ఆఫీసులో పనివల్ల వచ్చిన అలసట పూర్తిగా అదృశ్యమైపోయినది. ఇక ఇప్పుడు అతడు చేయవలసినది కులాసాగా భార్యతో కబుర్లు చెప్పడం పిల్లలతో ఆడుకోవడం.

ప్రతిసాయంత్రమూ ఒక గ్లాసుడు 'టీ' తో భర్తను ఆహ్వానించి అతని ఆమె సేద దీరుస్తుంది. సుఖమయమైన సంసార జీవనం గడపడానికి అతనికి అంతకంటే ఏం కావాలి? ఉల్లాసాన్నిచ్చే మంచి టీ తయారు చేయడం ఎంత సులభం! ఇక ఖర్చు విషయమా అదీ స్వల్పం. వ్యవధికూడ ఎక్కువ అక్కరలేదు.

సేద దీర్చే రుచికరమైన 'టీ' ని ప్రతి రోజూ త్రాగండి.

మంత్ర శక్తి నిచ్చే పానీయం

"టీ" త్రాగండి



సెంట్రల్ టీ బోర్డువారివల్ల ప్రచురింపబడినది.